ఓం

హాస్యసుధార్ణవ

వికటకవి

# తెనాలి రామలింగ

( ౪ అంకముల నాటకము )



సహజకవి

జనా సత్యనృసింహాచార్యులుచే

రచియింపఁబడియె.

గుడివాడ.




బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
కుంచా లక్ష్మీనరసయ్యగారిచే ముద్రింపఁబడియె.

1936




[వెల రు 1-0-0]

# కృతజ్ఞత

ఈ దృశ్యప్రతి ంకము మ॥ రా॥ శ్రీ సూరంపూడి సీతారామస్వామిగారు, శ్రీ లక్ష్మీ రాజు సింహాద్రి రాజుగారు, శ్రీ వేంకటేశ్వర్లు మోటారు సర్వీసు కంపెనీ, గుడివాడ, నూజివీడు, బెజవాడ, ఏలూరు ఆఫీసులకు సంబంధించిన మేనేజర్లు, మెకానిక్కులు, డ్రైవర్లు, కండక్టర్లు ఒనర్చిన దివ్యసహాయముచే నచ్చొత్తింపఁ జేసెఁగావున వారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

గ్రంథకర్త.

# చిన్నమనవి

పాఠకమహాశయులారా!

లోపము సర్వజనసామాన్యము. తెలియని లోపము లుండవచ్చును. తెలిసియు పొఱపడి యుండవచ్చును. అవి గుణగ్రహణపారీణులరగు తాము లెక్కగొనక గుణమును ప్రధానముగా గ్రహించి పిన్నవయస్కుండనగు నాపురోభివృద్ధి నభిలషించి ప్రోత్సహించెదరు గాక. నాయం దభిమానముగలవా రిందలిలోపములను దెలియ పఱచిన ద్వితీయముద్రణమున సవరించుకొందును.

గ్రంథకర్త.

# అంకితము

ననుఁ గని పెంచి పెద్దగ నొ♦నర్చి
సమస్తవిధంబులన్ గృపన్
మనిచిన తల్లిదండ్రులఁగు ♦ మాన్యుల
శ్రీమతి వీరభద్రమాం
బను ఘనవైద్యవేత్తయును ♦ మాసతిఁ
బ్రీతి భజించు నప్పలా
ఖ్యుని మదిఁ గొల్చి కావ్యసుత ♦ నొప్పుగ
నంకితమిత్తు మ్రొక్కుచున్.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు

| పురుషులు. | | ప్రవేశించు అంకములు. |
| --- | --- | --- |
| 1 | రామలింగకవి—కథానాయకుఁడు | 1,2,3,4,6,7,8 |
| 2 | సుమిత్రుఁడు—రామలింగని స్నేహితుఁడు | 1 |
| 3 | నిత్యానందస్వాములవారు—రామలింగని గురువు | 2,8 |
| 4 | కృష్ణదేవరాయలు—ఆంధ్రరాష్ట్రాధిపుఁడు | 3,5,6,7,8 |
| 5 | అప్పాజీ—రాయలవారి మంత్రి | 3,5,6,7,8 |
| 6 | తాతాచార్యులు—రాయలవారి గురువు | 4 |
| 7 | పెద్దన్న } ఆస్థానపండితులు | 3,4,6,7,8 |
| 8 | తిమ్మన్న } ఆస్థానపండితులు | 3,4,6,7,8 |
| 9 | భట్టుమూర్తి } ఆస్థానపండితులు | 3,4,6,7,8 |
| 10 | నృసింహకవి—లక్షుంటాకవి | 3 |
| 11 | భట్టరాచార్యులు—ఆస్థానము జయించినకవి | 7,8 |
| 12 | యేదులశాహి—నవాబు | 4 |
| 13 | వజీర్—నవాబుగారి మంత్రి | 4 |
| 14 | రంగఁడు } దొంగలు | 5 |
| 15 | సింగఁడు } దొంగలు | 5 |

| స్త్రీలు. | | |
| --- | --- | --- |
| 1 | సుశీల—రామలింగని అర్ధాంగి | 1,2,3,5,6,7,8 |
| 2 | కాళీమహాదేవి—మాహేశ్వరి | 2 |
| 3 | చతురిక—సుశీలపరిచారిక | 6,7 |



శ్రీరస్తు.

# వికటకవి తెనాలి రామలింగ

## ప్రథమాంకము.

సుమిత్రుఁడు—

మ॥ అనయంబున్ గలుషంబు వోనడచి నిత్యానందమూర్తిన్ బ్రస
న్నునిగా జేసియు దివ్యదర్శనమునన్ దోడ్తో మహాజ్ఞాన మ
ల్లన జేకూర్చియు రామలింగకృతలీలల్ వ్రాయించు దద్గాథ లె
స్సగను మన్నించు భవాని మమ్ము మనుచున్ పూర్ణోత్సుకం బేర్పడన్.

[రంగము రాచబాట - సుమిత్రుఁడు ప్రవేశించును.]

సుమిత్రుఁడు—అబ్బబ్బా! తిరిగితిరిగి వేసారితిని. కాని రామలింగము కానరాకపోయె. పాప మాసుశీల కన్నీరుమున్నీరుగా నేడ్చుచు నన్ను జూచి "అన్నా! సుమిత్రా! నిరంతరదుఃఖవారాశినిమగ్నల మగు మాపై నీకు కనికరములేదా? నీబాల్యస్నేహితుఁ డున్మాదియై యిల్లు విడచి ఎటకో వెడలిపోయిరి. అన్నా! అన్నా! శ్రమ యనుకొనక దయామయుండవై వారిని తోడ్కొనివచ్చి నాకనులయెదుట నిల్పి నన్ను రక్షింపవా?" యని ఖిన్నవదనయై పల్కు నా పతివ్రతా రత్నము నూఱడిలబల్కి యిటు బయలుదేరితిని. పాపము! గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు గడచిన రాత్రి చోరులాయింట దూరి

సర్వదుంబాళ మొనరించి పోయిరి. అయ్యో! తోడునీడలేక నల్లాడు నాయాడుబిడ్డకు కష్టములపై కష్టములు గూర్చువిధాత నేమన వలయును? హా! విధాతా!

గీ॥ భువిని సన్మార్గులకు గష్ట ♦ ములను గూర్చి
దుర్జనులపై దముల కెగ్గు ♦ త్రోవ జూపు
చుందు వేమందు నీ కల ♦ షాండసంఘ
బుద్ధి యీరీతి బుగ్గియై ♦ పోనె నౌర!

కానిమ్ము వితర్కింప ఫలితములేదు. ఇది యంతయు పూర్వజన్మార్జితదుష్కృతఫలవిశేషంబేకాని వేరొండుకాదు. (ప్రక్కకు జూచి) అల్లదే తుంటరిపిల్లలాడెన గొల్లున కేకలిడుచుండిరి. అట రామలింగ ముండియుండవచ్చును. ఇది స్వభావసిద్ధముగదా! (ఆలోచించి) ఇంక చతుర్విధోపాయముల నెట్లయినను వానినింటికి తోడ్కొనిపోయెదను గాక. (ముందున కుపక్రమించి) కాదు కాదు. అదుగో రామలింగ మాయల్లరిపిల్లలు వెంబడించుటచే నీయనకే పరుగిడి వచ్చుచున్నాడు. కానిమ్ము. (ప్రక్కగా నిలచి యుండును)

[రామకృష్ణుడు పిచ్చివేషమున పరుగున వచ్చి]

రా— కీర్తన॥ ధాతకు జందాల్ తెంపేస్తా
నీతివిదూరం దసిపిస్తా
శేషునినాల్కలు చీల్చేస్తా
కలిగిన విషమెల్ల కక్కిస్తా
కొండలన్ని పిండి కొట్టిస్తా
గండు దేవేంద్రుని చెండేస్తా
నింగికి నే పోయి నిలుచుంటా
వెంగలి వంటే చంపేస్తా॥ ధా॥

దానికేమిగాని, ఈ భూమేమిటి? ఈ ఆకాశమేమిటి? ఈ సూర్యుడేమిటి? ఈ చంద్రుడేమిటి? ఈ చుక్కలేమిటి? ఈ నక్కలేమిటి? ఇదంతా యేమిటి? ఏమిటంటే చెప్పవేమిటి? (సుమిత్రునిచూచి)

చెప్పూ! చెప్పూ!

చెప్పకుంటే డొక్క చీల్చేస్తాన్ కఱ్ఱబెట్టి బుఱ్ఱ పగలేస్తాన్.

చెప్పమంటే చెప్పవేమిటి? ఒళ్లు పొగరెక్కిందా? వెఱ్ఱిముండా!

(వెఱ్ఱినవ్వు నవ్వును)

సు—ఆహా! తుద కట్టివాని కెట్టిస్థితి సంభవించినది?

సీ॥ పూర్ణిమచంద్రుని ♦ బోలు నెమ్మోము నీ
గతి వికృతాకృతి ♦ గాంచె నెట్లు?
ఘన ఘనాకారమై ♦ ముద్దు లీనెడుమేను
కప్పు కప్పిన భంగి ♦ నొప్పె నెట్లు?
అజ్ఞాతముల దూరి♦నాడెడు కందోయి
భయదవిహ్వలములై ♦ పరగె నెట్లు?
సరససద్గుణగణ♦సంపన్నుఁ డీకిరియ
బిచ్చివాలకమును ♦ మెచ్చె నెట్లు?
గీ॥ ప్రీతి ముప్పిరిగొన వేల్పుని ♦ భక్తిఁ గొల్చి
దానశీలుఁడై పేరొందు ♦ మానధనుఁడు
నైన యీతనికీగతి ♦ యబ్బె నెట్లు?
మించి, యీవెఱ్ఱి వడి దాపరించె నెట్లు?

రా—అహూహూహూ! నాగలోకంలో నాగేంద్రుడు స్వర్గలోకంలో సుబ్బారాయుఁడు నరలోకం వచ్చి నాట్యమాడుకుంటారంట. నేను నాగస్వరం పాడుకుంటానంట. (సుమిత్రినిచూచి)

దిగుదిగు నాగన్న ♦ దివ్యసుందరనాగా నాగా దిగరా॥
ముదముతో రేపల్లె ♦ ముద్దులనాగా నాగా దిగర॥

(సుమిత్రిని చూచుచు) దిగమంటే దిగవేం. దిగూ, నాసంగతి తెలియదు గాబోలు; చెప్పుకుంటా విను.

కీర్తన॥ కోతిజాతిలోన మేలైనవాణ్ణి
గొప్పవాణ్ణి నన్ను తిమ్మన్నంటార్ ॥కో॥
చెట్లెక్కుతాన్ గట్లెక్కుతాన్
చెట్లెక్కి గట్లెక్కి చెర్లాడుతాన్ ॥కో॥

ఇంక నాకేంతక్కువ? చెట్లమీదనున్న పండ్లన్ని నావే. నానోట్లో యెప్పుడు పండ్లే ఉంటాయి. అబద్ధమా, చూడు (పండ్లికిలించి) ఇవన్నీ పండ్లే. కాదన్నవాడికి గంపెడు చెప్పుదెబ్బలు బహుమానం. దిగూ, దిగవేం. (సుమిత్రునిపై కెగిరి పడవేయును.)

సు—(పడి) అబ్బా, వీనికి పూర్తిగా మతిపోయినది. ఇప్పుడు వీనికి స్పృహకలిగించుటెట్లో తెలియకున్నది. (ఆలోచించి) ఆఁ తెలసినది. (ప్రకా) రామలింగా! నీపే రేమియో తెలియునా?

రా—పేరా? పేరంటే చూరు, చూరంటే చెఱువు, చెఱువంటే గుంట, గుంటంటే పంట, పంటంటే పంది, నేను పందినా? అహ్హాహ్హా! నన్ను పందన్నవాఁడిముక్కు పగలకోసి బ్రహ్మార్పణం చెయ్యాలని వేదాలు శాస్త్రాలు చెవులకు కొండరాళ్లుకట్టుకుని చెప్తూనే ఉన్నాయి. పట్టు. (బొడ్డులో నున్న పాతకొడవలిముక్క తీసి సుమిత్రుని ముక్కు పట్టుకొన బోవును.)

సు—(తప్పించుకొని) ఓరి నీవ్యాఖ్యానం పాడుగాను. ప్రాణముల మీదికి తెచ్చిపెట్టితివే తుదకు? (స్వ) సరే, కానిమ్ము. ఇప్పుడు తప్పించుకొను టెట్లు? ఆఁ !

ఆ॥ వె॥ తాగుఁబోతునొద్ద ♦ దాగుఁబోతువిధాన
వెఱ్ఱివానియెదుట ♦ వెఱ్ఱిగతిని
నెఱిగి తిరుగవలయు ♦ నరుఁ డటు గానిచో
గలుగు ప్రాణహాని ♦ చెలువు మాని.

కావున నీసమయమున నాలుగు వెఱ్ఱికూతలతో గాని నాముక్కు నిలుచు విధము కాన్పించుటలేదు. (ముక్కుపై గుడ్డగప్పుకొని) రామలింగా! నాముక్కక్కడ లేదురా, ఇంటిదగ్గర బెట్టి వచ్చితిని.

రా—నీముక్కు లేకపోతే నాముక్కులేదా? (తనముక్కు కోసికొన బోవును)

సు—ఆఁ! ఆఁ! రామలింగా! (చేయిపట్టుకొనును)

రా—(కోపముతో చూచి) ఏం, మాటిమాటికి అడ్డంవస్తున్నావే?

సు—అక్కరకాదు, ఈకొడవలి బాగుగా తెగదు. నావెంట వచ్చితివా? నీకు పదునైన బంగారపుకొడవలి నిచ్చెదను.

రా—నిజంగా నేనా?

సు—నిజముగా నే!

రా—ఇవ్వకపోతే పిల కెగురుతుంది సుమీ?

సు—అట్లనే.

రా--అయితే పద. (కొడవలి పాఱవైచి వెంబడించుచు) నే నెళ్లి బంగారుకొడవలి తెచ్చుకుంటా.

(నిష్క్రమింతురు)

---

## ౨ వ రంగము

(సుశీల విషాదములో నుండ తెర యెత్తబడును)

సు—హా! పరమేశ్వరా!

సీ॥ తండ్రియన్నను నెక్కడు ♦ దయను గనెడు
మామగా రన్న దివి జేరె ♦ మహితధనము
తస్కరులచేతఁ బడె నహహా! ♦ ధవునిఁ జూడఁ
జపలుఁ డయ్యె నిఁకేగతిఁ ♦ జనెడుదాన?

అమ్మా! దుర్గా!

సీ॥ వివిధరీతుల నిన్ను ♦ వివిధపూజలు సేయు
భక్తులఁ మఱచుట ♦ పాడియగునె?
అనవరతము నిన్ను ♦ మనమున ధ్యానించు
బిడ్డలఁ విడుచుట ♦ దొడ్డతనమె?
భవమహాతిమిరంబు ♦ బాయనికూనల
నాత్మ విసర్జింప ♦ నర్హమగునె?
కడు కృపామతివంచు ♦ తొడరి నిన్గొల్చు నీ
దాసుల గావమిఁ ♦ ధర్మమగునె?

గీ॥ అమ్మ ! నీ పదకంజతో • యంబె జీవ
నం బటంచు దలంచు కూ • నలను మదిని
దలఁపకుండుట న్యాయమా • జలజనయన !
ఘనకృపానిధి ! దుర్గ ! వం • దనము తల్లి !

హా ! పరమపావనమగువంశమున బుట్టితిని. పవిత్రహృదయుని జెట్టబట్టితిని. ఇఁక జీవయాత్ర సుఖప్రదంబుగ నెరవేర్పగలనుగదా యని రానున్నది కానక యువ్విళ్లూరెడుదానను. కట్టా ! తుద కెట్టి యిక్కట్టులకు లోను గావలసివచ్చినది. పాపపు దైవమునకు నేనేమి యపకారము గావించియుంటినో? అయ్యో ! తండ్రికన్న మిన్నయగు మామగా రంతరించిరి. ధనము వారి వెన్నంటిపోయినది. పోనిమ్ము, నా హృదయేశ్వరునకు సంపూర్ణ చపలత ఘటించి న న్నగాధదుఃఖజల రాశినడుమ బాఱవైచిన యా భగవంతు నేమనవలయునో తోఁచ కున్నది. అమ్మా ! పర్వతవర్ధనీ ! నిజదాసగృహాంగణ కల్పవల్లి వగు నీవే యిట్లు పేక్ష జేసిన యింక రక్షించువా రెవ్వరు తల్లీ ! కట్టా! వెదుక బోయిన సుమిత్రుఁడుగూడ రాడాయె! పాపము, నా మామగారు గతించిననాటనుండియు నన్ను తన సోదరికన్న నెక్కుడుగా జూచుచు నంధునకు చేతికఱ్ఱవోలిక్ కాపాడుచున్నాడు. (ప్రక్కకుజూచి) అదుగో అమ్మయ్యా ! సుమిత్రుఁడు నా నాథుని తోడ్కొని వచ్చుచున్నాడు.
(లేచి నిలుచును)

[రామలింగము, సుమిత్రుఁడు ప్రవేశింతురు]

రా—ధాతకు జందాల్ తెంపేస్తా
నీతివిదూరుం డనిపిస్తా
శేషునినాల్కలు చీల్చేస్తా
కలిగిన విషమెల్ల కక్కిస్తా.

సుశీ—(దుఃఖముతో రామిలింగుని పాదములపైఁ బడి) హా! నాథా! నాథా!

సీ॥ కులపత్ని నౌనన్ను • దిలకింప వదియేల?
తండ్రిపోయినమాట • దలఁపవేల?

వరబాంధవుల సేమ ♦ మరయరా వదియేల?
మిత్రులతోఁ గూడి ♦ మెలఁగ వేల?
అతిథిపూజలు సేయ ♦ మతి దొరంగితివేల?
గురుభక్తి విడనాడు♦కొంటి వేల?
ఇలువేల్పు దుర్గను ♦ దలపోయ వదియేల?
వెర్రికై వడి మనో♦వేగ మేల?
గీ॥ నాథ! నీధర్మపత్నినా ♦ నన్ను గృపను
గనవె సంపూర్ణమగుప్రేమ ♦ గౌగిలిడవె
జీవితేశ్వర! వేఁగ ర♦క్షింపు మనుచు
మ్రొక్కుచుండిన నీసతి♦మొఱలు వినవె॥

సుమి—అమ్మా! ఎందుల కిట్లు కుళ్లి కృశించిపోయెదవు? నామాట వినుము తల్లీ! విధివిధానము మానవ మాత్రులమగు మన కలంఘ్యము. ఇంక పోయినధనమునకై విచారింపగూడదు. ప్రాణము లున్న బలుసాకు దిని బ్రదుకవచ్చును. మామగారివిషయమంటివా? చావుబ్రతుకులు దైవాధీనములు. దాని కెవ రేమి సేయగలరు తల్లీ! నిజముచెప్పుచుంటిని. నిన్ను చూచినప్పుడెల్లను

మ॥ మును సావిత్రి యరణ్యభూములను దా ♦ మోదంబునన్ భర్తృప
ద్వనజద్వంద్వము నాశ్రయించి పతి జీ♦వం బెట్లు పెంపొందునా
యని సర్వాత్మకమైన యీశ్వరిని గు ♦ ర్వ్యాలింపగా వేడునా
జనయిత్రీమణి జ్ఞప్తివచ్చుగద యో♦సాధ్వీశిరోరత్నమా॥

సుశీ—అన్నా! మీరు నన్నోదార్చెదరుగాని యేవిషయము బాగున్నదని చూచి యూరటచెందగలను? ఆ భగవానుఁ డష్టకష్టములకు లోనగు నీ పాపిష్టిని ముందుగా గొనిపోయిన నెంతయు బాగుండెడిదిగదా!

సుమి—శివశివా! అమంగళము ప్రతిహత మగుగాక! అమ్మా! దుఃఖించినందువలన బ్రయోజనములేదు. నా మాట వినుము తల్లీ!

రా—మఱి తాతచెవులో పీత దూరింది; పీతమీద తాతపడ్డాడు. తాతాపీతా తన్నుకుచస్తే మధ్య నాకెందుకు? నేను కోతినైపోయి

చెట్టెక్కి కూర్చుంటే నన్నె వ్వారెవరూ లేరుగా (సుమిత్రుని భుజము లపై కెగిరి యిరువురు కూలబడి) చెట్టు విరిగింది గుట్టు దొరికింది. (సుమిత్రుని కాళ్లు పట్టుకొని యేడ్చును.)

సుశీ—అయ్యో! అయ్యో! (విడిపించి స్వగతము) ఏనేమి సేయుదును? ఆ పరాత్పరునికంటికి నేనొక్క తెనే పగదాననై కాన్పించితినా? నన్నా మహామహాబండితతటిదురంతచింతాసాగరమధ్యమున విసరిపార వేయ వలయునా? ఆర్తత్రాణ పరాయణునకు నామొఱ యించుకేనియు చెవిసోకదు కాబోలు. దిక్కులేని వారికి దీనజనావనుడే దిక్కుగదా! అట్టియెడ నాపతి నేల రక్షింపడు? న న్నేల యుపేక్షించును?

సుమి—(నెమ్మదిగా లేచి) అమ్మయ్యా, (సుశీలతో) అమ్మా! చింతింపకుము. తల్లీ! నీ వీయనను జాగరూకతతో నరయుచుండుము. నే బోయి యొకభిషగ్వరుని తోడుకొని వచ్చెదను.

సుశీ—అన్నయ్యా! ఈదిక్కులేని దీనురాలిని, భగవంతునకు సహితము భారముగా దోచు నీపాపాత్మురాలిని, జూచినదాది యొక్కనా నొక్క మీహృదయమునకు గదా దయ కల్గినది.

సుమి—అమ్మా, దయగల్గియు నే నేమి చేయగలను? నీవు జాగరూకతతో నుండుము. నేను పోయివచ్చెదను. (వెళ్లబోవును)

రా—ఏయ్! ఉండు ఉండు. (ఎదురుగా పోయి) పాకం చెడింది. ఒకీ రయింది, కూర కూడ దడుగుతోంది, యేమిటో చెప్పు.

సుమి—నాకు తెలియదురా!

రా—తెలియదంటే వీపు పగులుతుంది.

సుమి—(నవ్వి) సరే రామలింగా! ముందు నీవు చెప్పు. తరువాత నేను చెప్పెదను.

రా—చెప్పనా! సొఱకాయ!

సుమి—ఆఁ ఔను సొఱకాయ.

రా—అయితే తమరు వేంచేయవచ్చు. నేను భోంచేయవచ్చు.

సుమి—(నిష్క్రమించును)

సుశీ—హానాథా, హా జీవితేశ్వరా, తుదకు మనల నీగతికి తెచ్చిన యీ

భగవంతునకు మన మేమియపకారము గావించియుంటిమి? నాథా! నాథా! అయ్యో!! యెంతపిలిచినను పలుకరేమి? ఓపరమేశ్వరా! ఆర్తత్రాణ పరాయణా! దీనజనావనధురీణా! ఆపదుద్ధారకా! రక్షింపవా? రక్షింపవా? అయ్యో! నాజన్మపాడుగాను, ఆవిధాతకే నెంతటియపరాధము గావించియుంటినోగదా? కట్టా! నాజీవితము వొక తాడుతెగిన గాలిపడగవలె, నాధారశూన్యంబుగా నంబరవీధిని క్రిందుమీదగుచున్నది. నామనోనాథుఁడు (నాహృదయేశ్వరుఁడు) నానెయ్యంపుచెలికాఁడు నాకు దక్కునా! అయ్యో, నాహృదయ మంతకంతకు భారమగుచున్నదే! నాకనులయందు దృష్టి మందమగుచున్నది. నాశరీరము, నాయీకష్టభాజనోత్కృష్టమగు శరీరము కంపించిపోవుచున్నదే! దరిలేని యీదుఃఖనీరధితరంగపరంపరలమధ్య చావుబ్రతుకుల రెంటికిని చెడి యల్లాడుచున్న నన్ను రక్షించుటకు, అమ్మా! దుర్గా! నీకును భారమైనదా! ఒకదానివెనుక నొకటిగా నూపిరి సలుపనీయక మహావేగంబున వచ్చి పైఁబడు నారాచంబుల పగిది కననగు నశేషంబులగు నీకష్టజాలంబుల నెటులనగు నేను భరింపగలనా? తండ్రీ! నా మొరాలింపవా? నన్ను రక్షింపవా!

రా—(సుశీలను జూచి) అయ్యో, యేడుస్తావెందుకే? నీకు తేలుకుట్టిందా! యేడవకు, నేనుమంత్రిస్తాలే. ఝూ. ఝూ. పోయింది పో, పోయింది పో. (వెర్రిచూపుచూచి) అయ్యో! కొట్టకే నీకు పుణ్యాం ఉంటుంది, కొట్టకే.

సుశీ—నాథా! ఇప్పుడు మిమ్మెవరు కొట్టుచుండిరి?

రా—నువ్వే.

సుశీ—దేవా! మిమ్ము నే నేల గొట్టుదును?

రా—(పెద్దకేకతో) అదుగో, కొట్టవద్దంటే, అమ్మో! దెయ్యం! (యిరువురు భయమును నటింతురు.)

రా—నేను ఝడుసుకున్నా ననుకున్నావా? నాకు భయమే లేదుగా. అంతగా నాదగ్గఱకు వస్తే అమాంతంగా యెగిరి రెండు కాళ్లు ఝాడించి గుండెలు పగలతన్నుతా, ఇట్టా. (యెగిరి క్రిందపడును)

సుశీ—హానాథా! అయ్యో, పైకి లెండు (లేవతీయబోవును)

రా—ఆఁ ఆగూ! స్వతంత్రం లేకపోయినా మీదిమీది కొస్తున్నావే! అబ్బో, నేనేమి వెర్రివాడి ననుకున్నావా? భవానీదయే ఉండాలిగాని నా కీబ్రిహ్మాండమంతా ఒక్కడవడకిిందకు చాలదు.

సుశీ—నాథా, మీదయకొఱకై యెల్లప్పుడు మీ చరణదాసినగు నాకు స్వతంత్రి మేల కావలయును?

రా— అమ్మో, ఈరాక్షసులేమిటి, యీభూతములేమిటి ఇవన్నీ యేమిటి, (వెఱ్ఱిచూపులతో) రండు రండు మీరందరు వస్తే నాకేం భయమనుకున్నారా? మీయందఱి కాయువులు చెల్లినవన్నమాటే, రండు. చలిమిడిముద్దలవలె చల్లగా దిగమ్రింగి వాతాపి జీర్ణమన్నా నంటే వరసపెట్టి జీర్ణం కావలసిందే. (అటు నిటు చూచి) యేం, పారిపోతున్నారేం, యెంతదూరం పోగలరు, చుట్టూ సముద్రమే, పదండి. నేనుకూడా వస్తున్నా, త్రిలోకాలు పారజూచినా సన్నెదిరించి నిల్వేవాఁడెవఁడు లేడు, పదండి.

కీర్తన॥ పోతున్నదీ బండి పోతున్నదీ!

నీతిలేక రీతిలేక బూతులాట లాడుకొని

పోతున్నదీ బండి పోతున్నదీ !

(పారిపోవును)

సు—అయ్యో! నాథా! నాథా! నన్నొంటరిగా విడచిపోవతగునా? సుమిత్రా, నీవైనను లేకపోతివే? అయ్యో! ఆర్తత్రాణపరాయణా! దీనజనావనధురీణా! నాయార్తనాద మంతయు బధిరునిదరి శంఖధ్వని పోల్కి నీయెడ వ్యర్థమగుచున్నదేమిరా? హా, పరమేశ్వరా!

(మూర్ఛిల్లును)

(యవనిక జారును)

ప్రథమాంకము సంపూర్ణము.

---



శ్రీ రస్తు.

# వికటకవి తెనాలి రామలింగ

## ద్వితీయాంకము.

[రంగము రాచబాట. నిత్యానందస్వామి భక్తితో ప్రవేశించి]

నిత్యా — జే, శంకర్!

మ॥ జగతిన్ బుట్టుటచచ్చుటల్ మనుట లీ♦శా! నీదు సంకల్ప మీ
పగిదిన్ దృశ్య మదృశ్యమై తనర దౌ♦ర్భాగ్యుండ నల్పజ్ఞుఁడన్
తగుమర్త్యుండనె నేను నిన్ దెలియఁగా ♦ ధన్యాత్మ! రక్షింపుమో
నిగమాంతస్థితవేది, సాధుజనసం♦త్రాతా, జగద్రక్షకా!

ఎంతటి కపటనాటకసూత్రధారివిరా,

చ॥ కలి యను పాశమొండుఁగొని♦ కట్టడులన్ ముడులన్ దగిల్చి, యా
వల నొక తాసమం దునిచి ♦ వాంఛలనందగు విత్తనంబులన్
జలజల రాల్చి దాఘనను ♦ సందడి సేయక దాగు వేటరిం
బలె గనవాను వౌర యెట్టి♦వంటి మహాత్ముఁడవోయి శంకరా!

(పైకి చూచుచు) ఆహాహా, యేమి సంతోషదాయకము! యేమి మహానందప్రదము! ఆసమస్తదేవతాసంస్తూయమాన పాదపంకేరుహములు, ఆకమనీయంబగు గజచర్మాంబరము, ఆనిఖిలభూభృద్భార వహన సమర్థ శేషమణికంకణము, ఆ పాణితలంబునంగల

త్రిశూలము, ఆనిర్మల తేజస్సంపద, ఆశాంతరసప్రబోధ కాస్యము, ఆత్రి నేత్రముల సౌందర్యము, ఆజటాజూటంబున చిరునవ్వు దొలుకరించు చిన్నిముద్దుల బాలచంద్రుఁడు, ఆక్రొమ్ముడిఁ దాగిన కీరవాణి గంగా భవాని, ఆయమందానంద కందళిత హృదయారవిందయౌ జగన్మాత హైమవతీమతల్లి, అహో, ధన్యోస్మి ధన్యోస్మితండ్రీ!

కీర్తన:— ధన్యుఁడనైతిని । తగ నిను గనుగొని ॥ధ॥
గణ్యతజెందె । న్గా నాజన్మము ॥ధ॥
సకలకలుషహార । సామజమదహార । సఖిలలోకర
క్షక, సుకుమార । నిర్జితసుమశర । నీరజభవనుత ॥ధ॥
పాహి మాం పాహి—

హా! మహాదేవా! ఎన్నటికి ధన్యత్వము సంప్రాప్తమైనది! ఎన్నటికి నీపదకంజాతములు కనులార జూచుభాగ్య మబ్బినది! ఎన్నటి కీమాయాపాశబంధవిముక్తి చేకూడినది! ఎన్నటికి మానుముక్తుల దాయకుండవగు నీసమక్షంబు చేరుటకు దారి కాన్పించినది? ధన్యాత్ముఁడను, ధన్యాత్ముఁడను.

గీ॥ అనఘ! నీదగు కరుణారసాబ్ధియందు
చిలుగుపూవుల తెప్పపై సలలమధ్య
కేళిసల్పుచు నీ మృదుగీతికామ
హత్త్వమును బాడి ధన్యుఁడ నైతి దేవ!

దీనబంధూ!

గీ॥ చేరి నిర్వేద శోక నిధి చిక్కినట్లు
ఇరులఁ దెరువరి శోక దివ్వె తటిసినగతి
ప్రభువుమన్ననగన్న యల్పజ్ఞుపోల్కి
పతితుఁడను నాకు నీ మృదుపదము లబ్బె॥

(ధ్యానమగ్నుఁడై యుండును)

రా—(వెనుకగా వచ్చి నిత్యానందుని చేతులు పట్టుకొని)

పట్టాణ! పట్టాణ! యేమిపట్టాణ? దొంగను పట్టాణ. యేమి దొంగ? మాయదొంగ. యేమిమాయ? లోకమాయ. యేదీ?

యేదీ? (ప్రక్కగా చూచి విడచి) అమ్మో! బాబో! దెయ్యమే—
(గంతులువేయుచు) ధాతకు జందాల్ తెంపేస్తాన్,
నీతికిదూరుం డనిపిస్తాన్.

దెయ్యమైతే మన కేంభయం! (దగ్గరకుపోయి చూచి) కాదు! కాదు! మాతాత చచ్చినోడు మళ్ళా బ్రతికొచ్చాడు. పోనీలే! ఒక దండం పారేస్తే యెందుకైనా మంచిదే (సాష్టాంగముగా నమస్కరింపబోయి) అమ్మో! అమ్మో! ఇలా గండంపెడితే కళ్లుమూసికొని మీాదపడుగు వేళాడుతాంటే చచ్చినంతపని జరుగుతుంది. పైకిచూస్తూ దండంపెడితే ఫర్వానహీ అన్నాడు తురకబిడ్డ. (వెలికిలబడి నమస్కరించును)

నిత్యా—(కన్నులు తెఱచి) హా! పరమేశ్వరా! (రామలింగని చూచి) ఎవండీ మానవుడు! పాపము కిల్బిషమహార్ణవమునం దధఃపతనుండై దరిగానక కొట్టుకొనిపోవుచున్నాడే వీనిని చూచిన నెంతయు జాలి కలుగుచున్నది. హరోం! హరహర! మహాదేవ శంభూ! వీని నీవిధిగ నొనర్చిన విధి నేమనవలయును? విధినేల దూరవలయును? ఎవని కర్మము వానిది. పరంధాముండగు కపటనాటకసూత్రధారి తెఱయం దుండి యూట లాడించుచుండును. మానవు లా మహామహుని చేతిలోని నటకులు. వాని యిష్టానుసారము ప్రవర్తించువాని కగ్రస్థాన మొసంగుచుండును. పెడదారి త్రొక్కువారి నడుగున బడవైచియుంచును. ఇందొకరి నొకరనుట కేమిపని యుండును. ఈ మూఢున కేదేని యొకదారి జూపింపవలయును. మఱచితిని, నా సద్గురుప్రసాదితంబగు కాశీమహత్త్వం బెఱింగించి యేతన్మంత్రోపదేశమున వీనిం ధన్యాత్మునిగా నొనర్చెద గాక.

రా—(తొట్రుపాటున లేచి) మునిగారు! మునిగారు!

నిత్యా—ఏమి నాయనా?

రా—అన్ని మతాలలో యేమతం గొప్పదండీ?

నిత్యా— సమ్మతమే గొప్పది తండ్రీ!

రా—బలే! బలే! మునిగారు మంచిమాట చెప్పారు హాయ్,

హాయ్, (నిత్యానందుని పైకెత్తి అటునిటు త్రిప్పును)

నిత్యా—అయ్యో! అయ్యో! ఈతఁడేమి వెఱ్ఱివాఁడు కావలయును. (ప్రకా) నాయనా నన్ను క్రిందికి దింపుము. నీకు మంచిమార్గము చూపెదను.

రా—(దింపుచు) అమ్మయ్యా!

నిత్యా—వీని కీ కమండలోదకముచే కొంత శాంతి కల్పించెదనుగాక! (కమండలోదకము రామలింగనిపై జల్లును)

రా—చలికాలంలో చన్నీళ్లు మీదపడితే వళ్లుజలదరిస్తుంది మునిగారు.

నిత్యా—పోనీలే నాయనా, నీవెవ్వరివాఁడవు?

రా—నే నీవూరివాఁడనేనండి.

నిత్యా—అయ్యా! నీవేల తబ్బిబ్బు పడియెదవు? నన్ను నీసద్గురునిగా భావించుకొనుము. నీకు సుంచిదినములు ప్రాప్తింపనున్నవి. నే నడుగుమాటలకు సరియైన యుత్తర మొసంగుము.

రా—ఉత్తరీయము లేదండీ, చొక్కాయే ఉన్నది. (చిరుగుల చొక్కా విడచి నిత్యానందుని పాదముల సమీపమున పెట్టును)

నిత్యా—(చిరునవ్వుతోఁ దనలో) నిజముగా నిట్టివానిని రక్షించుటయే సమంజసము. (ప్రకా) నాయనా! నీ భక్తి కే నెంతయు సంతసించితిని. నీ చొక్కాను నీవు తీసికొనుము.

రా—(భయముతో నిత్యానందుని ముఖము చూచుచు చొక్కా గ్రహించును)

నిత్యా—అయ్యా! నీ నామమేమి?

రా—నానామం పంగనామం.

నిత్యా—కాదు! నీ పేరు?

రా—పేరు కాసులపేరే. యింకేముంటుంది?

నిత్యా—నీ తల్లిదండ్రులు నిన్నేమని పిలచెదరు?

రా—నాకు తల్లిదండ్రులు లేనేలేరుగా! నాయంతటికి నేనే పుట్టా!

నిత్యా—(నవ్వి) అయితే నీతోడివాండ్రేమని పిలిచెదరు?

రా—రామునికి లింగణ్ణి తగిలించి పిలుస్తారు.

నిత్యా—ఓహో! రామలింగమా?

రా—అద్గదీ మునిగారూ! నా పేరు నేను చెప్పుకున్నా చూశారూ! మునిగారూ! మీ కింకొక హ స్త ముండాలిగా యేదండీ?

నిత్యా—నాయనా! నాకు రెండేహస్తములు. ఇవిగో కుడి యెడమ యనునవి.

రా—ఇవికావయ్యా! మూడోది చాదస్తం.

నిత్యా—(నవ్వుచు) నాకు లేదు నాయనా.

రా—(పరికించి యోగదండము చూపుచు) ఇదుగో మునిగా రబద్ధ మాడుచున్నారు.

నిత్యా—రామలింగా! దీనిని యోగదండమందురు.

రా—దండమా? ఎవరిబుర్ర తీర్థంపట్టడానికి బాబూ?

నిత్యా—(స్వ) సామ దాన భేద దండోపాయములచే ముందు వీనిని స్వాధీనపరచుకొనవలయును. (ప్రకా) చెప్పినమాట వినని వారిని.

రా—అయితే మునిగారూ మీ రేమాటచెప్పినాసరే నేను వింటా!

నిత్యా—మంచిది, వినకపోయినచో.

రా—వినకపోయినచో ఆకాశమంత పిడుగు పడాలి.

నిత్యా—(నవ్వి) ఆస్థితి తటస్థించిన నందఱకు ప్రాణమోసమేగదా?

రా—నాకు తెలియదనుకున్నారా? పదిమందితో చావు పెండ్లితో

సమానంగాదూ? (వెఱ్ఱినవ్వు నవ్వును)

నిత్యా— (స్వ) (నవ్వుచు) మంచిది. వీనికింక దేవీమంత్రోపదేశంబున వెఱ్ఱి తప్పక యుపశాంతి నొందగలదు. (ప్రకా) రామలింగా, నీకు కాళీమంత్రోపదేశ మొనర్చెద నిటు రమ్ము.

రా—మునిగారు, గురువుగా రౌతారా యేమి?

నిత్యా—ఔను, స్థిరమతివై నాయుపదేశ మాలింపుము, ధన్యత బడసెదవు.

రా—ఐతే, చెప్పండి వింటా.

నిత్యా—(ఉపదేశ మొనర్చును)

రా—(వెఱ్ఱి యుపశాంతిజెందును) ధన్యుఁడను, ధన్యుఁడను, తండ్రీ, ధన్యుఁడను.

నిత్యా—నాయనా! (చూపుచు) ఇంక నీ వా యగపడు కాళీకాలయంబునకుం జని ఈమంత్రమును జపింప కాళి ప్రత్యక్షమై విద్యయు ధనము నొసంగి నిన్ను కృతార్థుని జేయగలదు, పోయిరమ్ము.

రా—(భక్తితో) చిత్తము. (నిత్యానందుని పాదములకు నమస్కరించి నిష్క్రమించును)

నిత్యా—ఇంక నీతఁడా దుర్గానుగ్రహమున మహానుభావుఁడు కాగలఁడు. ఐన నేమిజరుగునో ఈ సమీపమును నుండి చూచుచుండెదనుగాక.

(నిష్క్రమించును)

(తెరపడును)

---

౨వ రంగము.

[కాళికాలయమున రామలింగము ధ్యానసమగ్నుఁడై యుండ కాళి ప్రత్యక్షమగును]

కాళి— శ్లో॥ కృతం పాపవినాశాయ । కుమార మమదర్శనం,
సర్వకార్యాణి లభ్యంతే । విద్యావాన్ ధనవాన్ భవేత్.

కుమారా! నిత్యానందస్వాములవారి యనుగ్రహమునకతన లభించిన నీ మూఢభక్తికే నెంతయు సంతసించితిని. ఇడకు దేవతాసార్వభౌమునకేని యలభ్యంబగు నాదర్శనము నీకు సంప్రాప్తమైనది. నీవు కడుంగడు ధన్యుఁడవు.

వత్సా! యీ స్వర్ణపాత్రమునందు క్షీరములును యీ రజత పాత్రమునందు దధియు గలవు. ఏతత్క్షీరంబుల గ్రోలునెడ ధనవంతుఁడ వయ్యెదవు. ఈ దధి నారగింతువేని విద్యావంతుఁడ వయ్యెదవు. ఇందెయ్యది వలయునో కోరుకొనుము.

రా—తల్లీ! ఆ రెండుపాత్రలు నాచేతికొసంగితివేని నాయిష్టము వచ్చినది గ్రహించెదను.

కా—సరే నీయిష్టమువచ్చినదానిని గ్రహింపుము. (యిచ్చును)

రా—(రెండును నోటబోసికొని) అమ్మా, రెండును బాగుగానే యున్నవి.

కా—(కోపముతో) ఓరీ! దురాత్మా, నీతుచ్ఛబుద్ధి నాయెదుటనే ప్రయోగింప నెంచితివా? ఇదే చూడుము నీశిరము నాఖడ్గమున కెఱగావించెద. (త్రిశూలము పైకెత్తును)

రా—(దేవికాళ్లపైబడి) తల్లీ!

సీ॥ కాళికాంబరో నిన్నుఁ • గాదన నేరెంత
వాఁడనమ్మ భవత్కృ • పాప్రవృష్టి
చే, మొలకెత్తిన • చిఱుతపాపఁడ నన్ను
సదయతఁ బ్రోవఁ బ్ర • సన్నవగుచు
నాశీర్వదించి స • న్నాదరించి విరించి
మించువానిగఁ జేయ • నెంచియిపుడు
చేజేతలనె బట్టి • చెండాడుదు నటన్న
తల్లి బిడ్డలజంపఁ • దగవుగలదె
గీ॥ పాడియగునెడఁ గానిమ్ము • బ్రతుకుకంటె
చచ్చి, నీ దివ్యపదయుగ • సన్నిధాన
మందు స్థిరకీర్తి నలరుచు • నుందు తల్లి
కీడులో మేలు నాకొన • గూడు జనని!

కా—కుమారా, లెమ్మా, నీధైర్యమున కే నెంతయు సంతసించితిని, భయం బుడుగుము. ఇంక నీ వీ భూమండలిన్గల విద్వన్మండలియం దగ్రగణ్యుండ వయ్యెదవు గాక.

రా—ధన్యుఁడను తల్లీ! ఈ నీదాసుని యభిమతార్థమొం డనుగ్రహించి కృతార్థత ఘటింపుము.

కా—వత్సా! యేమది?

రా—అమ్మా! కృపామతివై భవద్విశ్వరూపప్రదర్శనంబున నీపాప కర్ముని పాపరహితునిగా నొనర్పుము.

శా—మంచిది. కుమారా! ఇదే చూడుము. (విశ్వరూపముజూపును)

రా— (చేతులుపైకి చాచి నమస్కరించును) హే జగజ్జననీ! త్రిలోకైక మాతా! మాతా!

దండకము.

శ్రీమత్పురారాతిసాధ్వీ! సుసాధ్వీ! సురానేక సంస్తుత్య పాద ద్వయీ! చాద్వయీ! భక్తవాంఛాభిసిద్ధిప్రదే! భర్తృవామార్ధభాగే! విరాగే! భవత్పాను రస్మీతి మాం పాలయత్వాం పరంజ్యోతిదుర్గే! భవత్పాదపంకేరుహాధ్యానపీయూషపానేనధన్యత్వమాప్తోస్మి సన్ముక్తి సామ్రాజ్య ధామ ప్రభావే శివే శైలరాట్పుత్రి, నానామునిస్తోత్ర సమ్మానితే, మంజువాణీ, రమాభారతీ సేవితాంఘ్రిద్వయీ! వేద వేదాంతవేద్యా, లసత్తారకారాజనీకాశహారావళీభార చారుస్తనే, వజ్ర వైడూర్య గోమేధికాబ్జోపలానేక మాణిక్య తేజస్ఫురత్కంక ణాలంకృతే, పద్మహస్తే,నవోల్లాస సంలిప్తచారుస్మితే, పూర్ణచంద్రా స్య బింబాధరే! శ్రీధరే! సంతతానంద సంధాయినే భూతధాత్రీ జగ న్నేత్రి శ్రీనారదానేక యోగీంద్ర గానావిలోలాలే, జగత్పూజ్యశీలే! మహోదార తేజోభరే, దివ్యపుండ్రేక్షు పాశాంకుశోత్ఫుల్ల నీరేజహస్తే నమస్తే నమస్తే నమః

తల్లీ!

మ॥ సకలంబుఁ భవదీయకుక్షిని దయా ♦ సాద్గుణ్యతఁ దాల్చు నీ
యకలంకప్రతిభాప్రభావమును ది♦వ్యజ్ఞాన మానీందు్ర లె
న్నిక సేయందగ రమ్మరో వినుము నీ♦నిర్వ్యాజకారుణ్యతఁ
బ్రకటింపఁ భువి నెంతవాఁడఁ గరుణఁ ♦ భక్తున్ గృపఁ జూడుమా॥

అమ్మా!

శా॥ పాపాత్ముండ నహంకృతి న్ప్రబలు దు♦ర్వ్యామోహవారాన్నిధిఁ
గైపెక్కంగ మునింగినాఁడ విలస♦త్కారుణ్యతఁ నన్నెటుల్
కాపాడఁ మది నెంచితో శరణు దు♦ర్గా నీపదాబ్జంపుఁబ
ల్లాప్రపుంగోరిన భక్తుఁడఁ గృపమెయిఁ ♦ బాలింపుమా శాంకరీ॥

తల్లీ, ఇంకచూడఁజాలను. నీవిశ్వరూప ముపసంహరింపుము.

(దేవి తిరిగి యథావిధి ప్రవేశించి)

కా—వత్సా భయం బుడుగుము.

రా—అమ్మా! నీవిశ్వరూపసందర్శనానంతరమున కొండొకసంశయము నీదాసునిహృదయా వేదన మొనర్చు చున్నయది.

కా—ఏ విషయమున?

రా—తల్లీ! కోపింపకుందువుగాక! నాకు దైత్యభార మధికంబగు నెడ ఒక్కముక్కున కీరెండుచేతులు ప్రయోగించినను నానాయవస్థలు పడవలసి యుండునే! అమ్మా నీసహస్ర శీర్షంబులకుఁ గలనాసికం బుల కొక్కతూరి యట్టిది సంభవించిన నా బాధ నె ట్లనుభవింప గలవా యని.

కా—(నవ్వి) ఓరీ! పలుగాకి! నీవు సకల విద్యావంతుఁడవు ధనవంతుఁడవు కాగలవు గాని వికటకవి వయ్యెదవు. అట్లయ్యును నీవు రాజసన్మానం బున నిరంతర సౌఖ్యపరుఁడ వై విరాజిల్లెదవుగాక.

(అదృశ్యురా లగును)

రా—(శక్తిని గానక భక్తితో) ఆర్తత్రాణ పరాయణీ! దాక్షాయణీ.

గీ॥ నీపదధ్యానమాత్రాన ♦ నఖిలలోక
పావనీపావనుండనై ♦ పరగి మదిని
తత్త్వమసియన్న తొలిపల్కు ♦ తత్త్వమెఱిఁగి
ధన్యతఁగంటిఁ గావునఁ ♦ దల్లి యిచట
భ్రమరకీటకన్యాయ మేర్పడియె నమ్మ॥

(నిత్యానందస్వాములను దలంచి) సద్గురూ! దీనబంధూ!

సీ॥ దుర్ణయుఁ నన్నుఁ జేదోయి సందిటఁజేర్చు
భవదీయ కరుణా ప్ర♦భావమునకు,
కడు భయంబున నిల్వఁ ♦ గా నన్ను దరిఁజేర్చ
సదయత దలఁచు ప్ర♦శాంతమునకు,
తెల్విసుంతయులేని ♦ దీనుని దగు ముదా
వహునిజేయు మహా ప్ర♦భావమునకు,

కఠినాత్ము నన్నిట్టి ♦ కరగించివైచిన
యతులిత భక్తి మ♦హాత్వమునకు
గీ॥ కాళికామంత్రి మర్మిలి ♦ గరపి నన్ను
ధన్యుఁగాఁ జేసినట్టి నీ ♦ మాన్యతకును
చంద్రునకు నూలుపోగను ♦ సరణి నిపుడు
భూరి కృపతోడ గొను నమ♦స్కార మనఘ!

కానిమ్ము మందటి కర్తవ్య మేమి? (ఆలోచించి) ఆఁ! విద్యానగర రాష్ట్రాధిపతియు విద్యాధికుల పాలిట కల్పవల్లియు నగు కృష్ణదేవరాయల యాస్థానంబున దేవీ వరప్రసాదంబున సుఖం బుండెదగాక. (నిష్క్రమించును)

---

తెరంగము.

(సుశీల దుఃఖముతో కూర్చుండియుండ తెరలేచును)

సు—అయ్యో! శంకరీ నన్ని కష్టపరంపరలకు నీచేతులార సమర్పింప నీమనస్సున కెంత యింపుగా నున్నదే! ఆపాదుబ్రహ్మ నానోసట నీ కష్టములనే గ్రుచ్చి గ్రుచ్చి వ్రాయవలయునా? హా! నానాథుఁడు నామనోనాథుఁడు నాహృదయేశ్వరుఁడు యెందేగెనోగదా! ఇఁక నాబ్రతుకు అడవిగాచిన వెన్నెల కావలసినదేనా? రేరేడు లేని రాత్రిని బోల్పవలసినదేనా? అయ్యో! దీనబాంధవుఁడు నన్ననాథగా నొనర్చి తానే యుట్టిగట్టుకొని యూరేగ దలంచెనా? నే నేజన్మంబున నేమిథునంబుల నెడబాపి వార లేడ్చుచుండ చూచి సంప్రీతినో ఆ ఫలిత మిప్పు డనుభవింపక తప్పునా? ఆఁ! యేమీ? తప్పదా? నాకీయెడ బాటు తప్పదా? నాజీవితేశుని నేను మఱల చూడనా? చూచు భాగ్యమే లేదా? లేకపోయిన నిఁకనాజీవిత మేమి కావలయును? అన్నా మఱచితిని. వెతుకఁబోయిన సుమిత్రునకుఁగూడ కానరాలేదట. ఇంక నేనేమి సేయుదును. అయ్యో! యేమి సేయుట కేమున్నది? అనాథల కందరికి యేదారియో నాకును అదే దారి. శీలవతుల కందరికి యే తెలివో నాకును అదే తెలివు. (పైట మెడకు ముడివేసికొని) ఓ పర

మాత్మా! ఓ దీనబంధూ! ఓ చరాచరజంతుజాల పరమామ్నాయ రహస్యవేదీ! ఎన్ని జన్మంబులకైనను నాపతినే నాప్రాణపతిగా నొనర్తువుగాక. నేటితో నా ఈకష్టములు గట్టెక్కుగాక! యీ దీనురాలిని నీలో చేర్చుకొనుము. (బిగించుకొన బోవును)

నిత్యా—(చటాలున ప్రవేశించి) అమ్మా! ఆగు మాగుము ఆత్మ హత్య మహాపాతకము. నీవు సాధుశీలవు, సుగుణ రాశివి, కామినీజన శిరోభూషణమవు నీవే యిట్లు తొందరపడిన ముందుగతి యేమి కావలసియున్నది.

సు—(స్వ) అయ్యో! మృత్యువుగూడ నన్ను చేరుటకు భీతిలుచున్నదే! ఇప్పుడే నేమిసేయుదును? ఈ మహాపురుషుం డెవరు? (ప్రకా) మహాత్మా, నమస్కారములు. ఈ పాపిపై నేల మీ కింతజాలి కలుగవలయును?

నిత్యా—అమ్మా! నీవు రామలింగనియర్ధాంగి వగుటయు, నీ నాథుం డున్మాదియై పారిపోయెనని తలంచి నీ వీ యమానుషకృత్య మొనర్ప సాహసించుటయు యోగదృష్టివలన నెఱింగి యిటువచ్చితిని. కాని నీవు తలంచినట్లుగాక నీ నాధుండు మదుపదేశిత దేవీమంత్ర ప్రభావంబున సాక్షాత్కరించిన దివ్యప్రభావిభాసితయగు దుర్గా నుగ్రహంబున పునర్జన్మ ధరించి విద్వజ్జనసంస్తూయమాన మహా మహిమాతిరేకంబున ప్రకాశించుచు విద్యానగరమం దాద్యంత రహిత యశశ్చంద్రికా విభూషణుం డగు వైరిరాజ దురూహ్యా జిష్ణుండైన కృష్ణదేవరాయల యాస్థానంబున నుండ నిందు మనం బునర్ జనియె. ఏ తదానందవార్తావిశేషంబుచే నీ కర్ణరసా యనంబుగావింప నుత్సహించి యిచ్చటి కరుదెంచినాడ. నా పేరు నిత్యానందు డందురు నే నొక చిన్న తాపసిని.

సు—(నిత్యానందుని పాదములకు నమస్కరించి) తండ్రీ! మీరు నిజ ముగా నిత్యానందస్వరూపులే. మీ యనుగ్రహంబునగదా మజ్జీవి తేశుం డంబికావర ప్రసాదుండయ్యె, మీ యనుగ్రహంబు కతన

గదా, మీ దాసునిదాసి యమందానందతుందిల హృదయార
విందయై బ్రహ్మానంద భరిత యయ్యె.

ఆ॥ వె॥ చలువజిమ్మువాఁడు ♦ చలువల రేడయ్యె
వేడియొసగు సినుఁడు ♦ వేడివేలు
పయ్యె గుణము ముఖ్య♦మాట నిత్యానంద
మయుఁడవౌట పేరె ♦ మార్గదర్శి.

(స్వ) పరాత్పరుఁ డిడినవన్నియు కష్టములని తలంచితిని. కావు, అన్నియు సుఖములే. ఇప్పుడు నానాధుని చేరుట కుపాయ మెద్ది? అదియు నీ పూజ్యుని యనుమతంబున బడయుదునుగాక, - (ప్రకా) తండ్రీ! నానాధునిసన్నిధానమునకు నన్నుగూడచేర్చి యాపున్నెమును తామే-

నిత్యా—అమ్మా! నీ ప్రాణపతి పునర్జన్మ ధరించుటంజేసి నిన్ను మఱచి యున్నాడు. యథార్థముగా మఱల నీ వాతనిచే స్వీకరింప బడగలవు. తదుపరి వృత్తాంతమంతయు నీకే తెల్లము కాగలదు. ఇఁక నీవు విద్యానగరమునకు పొమ్ము, శుభము కలుగగలదు. నే పోయి వచ్చెదను.

(నిష్క్రమించును)

సుశీ— ఈ మహామహునియాజ్ఞ శిరసావహించెదగాక! నానాధునకు నాపై ననుగ్రహము కల్గునటు లా కాళీమహాదేవియే వరము ప్రసాదించుగాక! (నిష్క్రమించును)

ద్వితీయాంకము సంపూర్ణము.





శ్రీ ర స్తు.

# వికటకవి తెనాలి రామలింగ

## తృతీయాంకము.

రంగము : ఆస్థానము.

[పెద్దన్న, తిమ్మన, భట్టుమూర్తియుండగా తెరలేచును]

కృష్ణదేవరాయలు— (ప్రవేశించి)

శా॥ ఆహా! కన్నుల పండువయ్యెడు మదీయం బైన యాస్థానమం
దోహోయంచు నుతుల్ గొనఁగలుగు సత్యోద్యత్ప్రభాకావ్యసం
దోహశ్రీ నను జెందఁజేసి యశముల్ దుగ్ధాయమానంబుగా
బాహాపీఠిక నిల్పుచున్న కవసంపాగల్భ్యులఁ గాంచుటన్

(అందఱు కూర్చుండ)

మ॥ భరమైయొదోచుచునున్న నిమ్మహితభూభారం బవార్యంబుగా
సరవిన్ క్షీరములందుఁదాల్చెడు ఘనాశాకుంభు లట్లన్ ధురం
ధరు లీ సప్తకవి ప్రకాండులకు మోదం బెంతయున్ గూర్పఁగా
వరభాషానిధి యింకనొక్కరుఁడు సంప్రాప్తింప మే లౌఁగదా!

ద్వారపాలకుడు — (ప్రవేశించి) ఆంధ్రరాష్ట్రాధిపా, జోహార్. తమ దర్శనార్థమై యెవరో మహాకవి యరుదెంచి ద్వారముకడ వేచి యున్నారు.

కృ—మంచిది, లోనికి ప్రవేశపెట్టుము.

ద్వా—చిత్తము.

రామలింగము—(ప్రవేశించి) ఓ, సమస్తరాజ్యలక్ష్మీ కరగ్రహణ ధౌరేయా, కృష్ణ రాయా!

మ॥ కలనన్ దావకఖడ్గఖండితరిపు • క్ష్మాభర్త మార్తాండమం
డలభేదం బొనరించి యేగునెడఁ ద • న్మధ్యంబునన్ హారకుం
డలకేయూరకిరీటభూషితుని శ్రీ • నారాయణుం గాంచి లోఁ
గలగం బారుచు నేగె నీవ యను శం • కన్ కృష్ణరాయాధిపా!

(వేరొకవైపున కేగి)

మ॥ పరమార్థంబొ యథార్థమో తనదు లో • పంబైనఁ గాకున్నఁ జం
దురుఁ డాత్మీయ కళంకమూడ్పుటకు మం • దు న్గోరి గట్రాయనిన్
హరునిన్ సోదరునిన్ బయోనిధిని వే • నర్థించి వ్యర్థంబునౌ
తరి నీకీర్తిని జూచి చాచుఁగరమున్ తాఁ • గృష్ణరాయాధిపా

కృ—(లేచి నమస్కరించి)

మ॥ అనఘా! మీనుడి తేనెలానుటనె ధ • న్యత్వంబు సంప్రాప్త మ
య్యెను దన్మాత్ర మెఱుంగశక్యమె యహో • కృష్ణార్పణంబంచు నా
ఘనసామ్రాజ్యము నెల్లఁ దానమిడినం • గానీ మరేమైన మీ
ఋణముల్ దీర్పఁగఁజాలఁ గోరుకొనుఁడీ • యేమీ మనోభీష్టముల్.

రా—రాజా! దానికేమి, రాజ్యాంగనాకరపీడన మొనర్పనీవే సమర్థుడవు, అయ్యది మాబోంట్ల కనుచితము సుమా.

కృ—దేవా! భవత్పవిత్రనామాక్షరము లెఱుంగనగునా?

రా—రాజా, నన్ను రామలింగ మందురు.

కృ—ధన్యుఁడను.

చ॥ పరమపవిత్రమయ్యె మది • భవ్యచరిత్ర! త్వదీయదర్శనం
బిరవునఁ గల్గుట న్స్పృహ మ • దెంతయుఁ బావనతన్వహించె సా
దరమున వీను లీ యమృత • ధారల మించు మృదూక్తులన్ వినన్
గరము బ్రియమ్ముఁజెందె ననఘా మనఁగా నిఁక ధన్యుఁడన్గదా.

కవిసింహమా, సింహముద్భగ్గోచరమగు నెడల విడచుట ధర్మమా?
విడువకుండుట ధర్మమా?

రా—విడువకుండుటయే రాజధర్మము.

కృ—ఏమి చేయవలసి యుండును!

రా—శృంఖలములచే బంధించి విలాసార్థము పట్టియుంచవలెను.

కృ—మంచిది. (తిమ్మరసువంక చూచి) అప్పాజీగారూ! సింహతలాటములఁ దెప్పింపుడు. (తిమ్మరసు లోనికేగి తెచ్చి యీయగా నందుకొని) దేవా! తమిమ్మి సింహతలాటశృంఖలములచే బంధించి కవిదిగ్గజములను పట్టి విడఁదీయకుండుటకై నా యర్ధసింహాసనమున నుంచి తరింప నుత్సహించియున్నాను.

రా—(చిరునవ్వుతో) మంచిది.

కృ—(సింహతలాటము తొడిగి యర్ధసింహాసనమున కూర్చుండబెట్టుకొనును)

భ—(జనాంతికముగా) పితామహా! మనపై నీ యాంకుశమేమి?

పె—రామ రాజభూషణా! "విద్వాన్ సర్వత్ర పూజ్యతే." యనునార్యోక్తిని మఱచితివా?

భ—ఔనుగాని, ఈతని వశపరచుకొనకున్న మన మీసభ నుండుటయే కడుంగడు దుస్తరము. పితామహా! ఈతఁడు దేవీవరప్రసాది యనియు వికటకవి యనియు కర్ణాకర్ణికగా వినియుంటిని.

తిమ్మన—రామరాజభూషణా! కడచిన మూడుదినములనుండియు నీ వీ కవిచంద్రునకు రాజసందర్శనము కలుగనీయక వెతలబెట్టుచుంటి వని వినియుంటిని. నే డేమి యూరకుంటివి?

భ—ఊరకుంటగాదు! తలపెట్టిన యెత్తులెల్ల చిత్తులగుటం జేసి యేమియు తోచక యూరకొనుటయైనది.

తిమ్మన—పై యెత్తు వేయలేకపోతివా?

పె—ఏమీ! రామరాజభూషణా! చేయిచేయి కలిపి బలాబలంబులు గ్రహించితి వన్నమాటే.

భ—ఆఁ! గ్రహించియే చెప్పుచుంటిని.

తిమ్మన—చెప్పుచుంటివిగాని చేసినదాని కంతకంత యనుభవింపవలసి వచ్చునేమో కొంచె మాలోచించుకొనుము.

రా—(తనలో) కాళీమహాదేవియనుగ్రహమున పరబుద్ధివిమర్శనం బను దివ్యయోగంబున నీ భట్టుదురభిప్రాయము తెలిసినది. కాని మ్మీతనికి తగిన ప్రాయశ్చిత్త మొనర్చెదను.

కృ—(రామలింగని చూచి) కవిచంద్రమా! ఈ శుభదినంబున మాయెల్లరిహృదయంబు లానందపారవశ్యతజెంద నందకుమారుని యవతారవిశేషం బభివర్ణించి కృతార్థత ఘటింపగలరని నమ్ము చున్నాను.

భ—(పెద్దనతో జనాంతికముగ) మంచిసమయము చిక్కినది. ఇప్పు డీతనిచే నాశువుగా చెప్పబడు వృత్తమును పునరుచ్చారణ మొనర్చి యింతకు మున్నే యున్నదని చెప్పిన సభామధ్యమున నీతని కెంతయు చిన్నతనము కాదా?

పె॥—(విసుగుతో) ఇప్పుడట్టి యేకసంధాగ్రాహి నెందు తేగలవు?అబ్బా! రామరాజభూషణా, ఎందుల కిట్లందనిపండ్లు కఱ్ఱులు చాచెదవు?

రా—(స్వ) మంచిది. ఈ భట్టుదురుద్దేశమునకు తగినట్లాచరించెద(ప్ర॥) ప్రభూ.

మ॥ అతిదోఃపీడనకర్కటీఫలితకంఠాభత్వదుర్ధర్వధూ
ర్తతృణావర్తదృఢాంగపాతహిత గోత్రాభర్తృకోత్పాదిత
క్రతుభుగ్గాద్రిగ్రహణాగ్రహోన్ముఖ శతారధ్వస్త మైనాకని
వృతనభ్రాంతిగ నందగోపకసుతబ్రహ్మార్క స్తుమస్త్వామహో.

కృ—ఆహా! యేమీ శ్రీకృష్ణపరమాత్మ నందకుమారుండై తృణావర్తుం డను రక్కసుని, శతమఖుండు మైనాకుని వజ్రపాతముచే నేలఁగూల్చి నటుల తనపిడికిటిపోటులచే నొప్పించి విజృంభించు గోపాలకృష్ణ మూర్తిని స్తోత్రముచేయుచున్నా మనియా! ఆహా! నే డమూల్య పద్యరత్నములు విని ధన్యుఁడనైతిని.

పె—(భట్టుతో) రామరాజభూషణా! ఏదీ నీసామర్థ్యము చూతము.

భ—(సిగ్గుచే తల వంచుకొనును)

కృ—(సంతోషముతో) కవిచంద్రులారా! నా యీసమస్యను పూరిం పుడు.

క॥ కలనాఁటి ధనము లక్కఱ
గలనాఁటికి దాఁచఁ గమల♦గర్భునితరమా?

పె—(లేచి)రాజా! నెలనడిమినాఁటి వెన్నెల
యలవడునే గాదెఁ బోయ ♦ నమవసనిశికిన్.

రా—(నవ్వుచు) ఓహోహో! ఇవి పెద్దన్నగారిప్రయోగములా యేమి! తాతా! తాతా!

క. యెమి దిని సెపితివి కపితము
బమపడి వెఱిపుచ్చకాయను ♦ వడి దిని సెపితో?
ఉమెతకాయను దిని సెపితో
యమవసనిశియన్నమాట ♦ యలసనిపెదనా?

పె—(తలవంచి కూర్చుండును)

భ—(స్వ) ఈతఁ డన్నింటను తానే నిరంకుశుండనని తలంచుచున్నాఁడు కాఁబోలు! ఈతనిగర్వము తుదంట నశింపజేసెద గాక! పాపము పెద్దలగు పెద్దనామాత్యులనే గద్దించి విడచిన ఈతనిసుద్దులకు హద్దు సమీపించినదిలెమ్ము. పెద్దన్నగారు అమావాస్యశబ్దంబునకు తద్భవంబగు నమవసకు నిశాశబ్దము చేర్చుటచే నోటిమాట బయటకు రాకమున్నే యాక్షేపించెను. మంచిది కానిమ్ము. ఇప్పుడే నొక సమస్య నొసంగి ఈతని తగినట్లు పరాభవించెదగాక. (ప్రకా) రామలింగా! పెద్దన్న నాక్షేపించినఘనుఁడ నని సంతసింపక నేనొసంగెడు సమస్యను పూరించి నీ సామర్థ్యమును తేటపరచి పదపడి సంతసింపుము. ఇదుగో సమస్య!

"క॥ కుంజరయూథంబు దోమ♦కుత్తుకఁ జొచ్చెన్."

పె—(స్వ) ఇక్కడకు నాకు తగిన ప్రాయశ్చిత్తమైనదా, యిఁక మా భట్టు నేనొకఁడను మిగిలితినని తల పైకెత్తినాడు.

కృ—ఆహా! ఏమి, యేనుగులగుంపు దోమకుత్తుక జొచ్చెననియా! సెహబాస్.

రా—(కోపముతో లేచి) అవును (భట్టుమూర్తిని చూచి) ఓరీ! భట్టూ! నీవు నా సామర్థ్యము జూచునంతటి సమర్థుఁడవుగా- అయిన నిదిగో పూరించుచుంటిని-

క॥ గంజాయి త్రావి తురకల
సంజాతులఁగూడి కల్లు • చవిగొన్నావా!
లంజలకొడుకా యెక్కడ
కుంజరయూథంబు దోమ•కుత్తుకఁ జొచ్చెన్.

భ—(సిగ్గుచే తలవంచికొనును)

కృ—(స్వ) అబ్బా! ఈమహాకవి తనపై వీరికిగల నీర్ష్యాభావమును గ్రహించి దూషించి యుండవచ్చును. పాప మీ రామరాజభూషణుఁడు వినరానిమాటలు విని హృదయసంక్షోభ పరవశుడయ్యెను. మఱల నీసమస్య వేఱొకవిధముగా నీతనిచే పూరించునటుల జేసి కలిగిన వ్యథకు కొంత శాంతి గలుగజేసెద గాక. (ప్రకా) కవిచంద్రమా! ఈసమస్య మే మొసంగినదిగా భావించి యిందు భారతార్థము వచ్చునటుల పూరింపుడు చూతము.

రా—(నవ్వుచు) చిత్తము.

క॥ రంజనచెడి పాండవు లరి
భంజనులై విరటుఁగొల్వఁ • బొల్పడి రకటా
సంజయ! విధి నేమందును
కుంజరయూథంబు దోమ•కు త్తుకఁ జొచ్చెన్.

కృ—ఆహా! భావము రమణీయముగా నున్నది.

[ద్వారపాలకుఁడు ప్రవేశించి]

దేవా! నమస్కారములు. శ్రీవారిదర్శనార్థమై లక్షఘంటాకవి యను మహాకవి విచ్చేసి యున్నవారు.

కృ—లోనికి దోడ్కొని రమ్ము.

ద్వా—చిత్తము.

[లక్ష్మఘంటాకవి ప్రవేశించును]

కృ—(లేచి) స్వామీ! అభివందనములు, ఆ యాసన మలంకరింపుడు.

ల—(కూరుచుండి) నృపాగ్రణీ!

మ॥ జయపత్రంబు లొసంగెదో కవులనే ♦ చర్చింపఁగాఁబంపెదో
భయభావంబును వీడి పల్కుము సభన్ ♦ భాషింపఁగా ధీమతుల్
నయవాగ్జాలగరిష్ఠు లుండిరని వి♦న్నాణంబుమై వింటి కో
రి యహీనంబున గెల్వవచ్చితిని పే♦ర్మిన్ గృష్ణరాయాధిపా?

రా—(స్వ) ఇప్పు డీభట్టువిషయము పూర్తిగా బయల్పడగలదు. నేను కొంతవరకు మౌనము వహించెదగాక.

ల—అదియునుంగాక, ఓరాజా! ఎట్టి యపశబ్దంబునైనను నిట్టె సుశబ్దంబు చేసివైచెదను. పదపడి వ్రాతయందు నాయట్టి దిట్టరి పట్టుబట్టి వెదకినను లభింపడని నొక్కి వక్కాణింపగలను. ఇఁక నెట్టి గూఢార్థమునైనను నిట్టె విడదీసి కట్టెదుట పెట్టగలను. ఇది యదియననేల? మీకవులకు దేనియం దసమానపాండిత్యము గలదో అందే చర్చింపవచ్చును.

రా—(స్వ) ఓహో! యీతఁడాత్మశ్లాఘాపరాయణుఁడుగా గాన్పించుచున్నాడు. కాని మీమ్మతని దుర్గుణము తొలగించెదగాక (కవులు నివ్వెరపడి చూచుచుందురు)

కృ—(ఆశ్చర్యముతో) ఏమిది?

మ॥ పలుకాడం గలవార లాంధ్రకవితా♦ప్రావీణ్యదిగ్దంతు లు
జ్జ్వలభాస్వద్ఘనదివ్యకావ్యరచనా♦చాతుర్యసామర్థ్య లీ
యిల నెవ్వారలు సాటిలేనిఘనులే ♦ యీరీతి నిశ్చేష్టులై
తల పంకించుచు నుండి రేమికతమో ♦ ధైర్యంబు వోనాడుచున్.

ఈ రామలింగము మొగంబునమాత్రి మించుక తేజస్పంపద తాండవమాడుచున్నది. ముంచినను తేల్చినను ఈ మహనీయుడొక్కడే. ముందందతని ప్రబోధించి చూచెదనుగాక [ప్రకా] ఓకవి పుంగవులారా! మిమ్మెల్లర జయింపవచ్చిన యీ నిఖలభాషానిపుణునకు

జయపత్రింబు లోసంగమందురా లేక మీ మీ సామర్థ్యములను జూపి మీరే జయమును పొందెదరా?

పె—[భట్టుమూర్తితో జనాంతికముగా] రామరాజభూషణా వారినివీరిని లొంగ దీయగలనని ప్రతాపములుగొట్టుచుంటివే! సమయము వచ్చినపుడుసాక్షాత్తు శివయోగీంద్రునివలె కూర్చుంచువేమి?

భ—ఆంధ్రకవితాపితామహుండవు నీవుంటివి గాదా?

తి—మసలో మనమిట్లు వాదప్రతివాదము లాడుకొనుచు కూర్చున్న నేమి ప్రయోజనము?

భ—ఈ భారమంతయు మనకెల్లరకు పెద్దలగు పెద్దనామాత్యులే నిర్వహింప సమర్థులు.

తి—నిజము.

పె—(స్వ) సమయము వచ్చినప్పుడు లేనిపోనిపెద్దరిక మంతయు నాపై పాలవైచుచుందురు. ఇప్పుడే నేమిచేయుటకు దారి కానరాకున్నది. అందును ఎదుటవానిసమర్థత గ్రహింపక వాక్కలహము నకు జొచ్చుట పామరలక్షణము. పోనీ యని యూరకున్న పండిత మాని యందురు. ఇంతకు నా పరమేశ్వరుడే గలడు. కాని నివురు గప్పిన నిప్పువంటిదమువనున్న యీ రామలింగకవి నిందలకు పుర కొల్పిన బాగుండునేమో [ప్రకా] రాజేంద్రా! ఇప్పట్టున మన రామలింగకవి తప్ప యీ కార్యభారము వహించుట యన్యుల కసాధ్యము.

కృ—[రామలింగనితో] కవిచంద్రమా ఇట్టిసమయమున తాము మౌనము వహించుట భావ్యమా?

రా—రాజా! ఇందు మౌన మేమి కలదు. రామరాజభూషణాది మహాకవులు కలరుగదా యని.

భ—[సిగ్గుచేత తల వంచుకొనును]

కృ—వార లూరకుండుటచేతనే తా మీ కార్యము నిర్వహింపవలసి వచ్చినది.

రా—[స్వ] మనకు ముఖ్యముగా కావలసిన దీతనిగర్వపరిహారమే. [కృష్ణదేవరాయని చూచి] రాజా! మీయభిప్రాయానుసారముగా నరసికజన సంభాషణమునకన్న రసికజన వాక్కలహమే మేలు కావున మా కనుజ్ఞనొసంగెదరా?

కృ—మంచిది.

రా—(లక్షఘంటాకవిని చూచి) తమ నామధేయ మేమి?

ల—ప్రెగ్గడరాజ నృసింహాకవి యందురు.

రా—(సాక్షేపముగా) నృసింహాకవి యందురా?

నృ—ఔను (స్వ) ఈతఁడు వికటముగా మాటలాడ మొదలిడి నాడు. కాని మీ్మతని గర్వ మడంచెదగాక.

రా—కవిత్వము చెప్పగలరా?

నృ—వెధవకవిత్వము. కవిత్వమే చెప్పలేక పోవలయునా?

రా—ఇంక నెందు నెక్కుడు పాండిత్య మున్నదంటిరి?

నృ—అన్నిటియందును.

రా—అనగా?

నృ—అనగా కవిత్వము చెప్పుటయందును, గూఢార్థ విమర్శన మొన ర్చుటయందును వ్రాయుటయందును మొదలగు విషయముల యందు.

రా—ఆహా! నాకుగల సందియము నివర్తి కాగల దినము నేటికి సంప్రాప్తమైనది.

నృ—[స్వ] అయినది-ఈతనిపస యింక రెండునిముసములలో తేల్చివైచె దను. (ప్ర) ఏమాసందియములు.

రా—వ్రాయుటయందును తిప్పులు దిద్దుటయందును సమర్థుఁడగు కవి నా కింతవరకు కానరాలేదు. నేటికి నాపూర్వపుణ్యమున లభించితివి.

నృ—(స్వ) ఈతఁడు నన్నిచొప్పదంటుప్రశ్నలా యడుగ దలంచినవి. ఇంక నీతనిసామర్థ్యము వెల్లడియైనది (ప్రకా) ఇస్సీ! చాలగొప్ప సంశయము లడుగదలచితివి. వీనికి నాశిష్యులలో నధముఁడు సరియైన యుత్తరవు లొసంగి నిన్ను తృప్తినొందింపగలఁడు.

రా—అయ్యా! నీశిష్యులకు గరపిన తెలుంగెలుంగవలయునని వేడు చుంటిని (పత్రము ఘంటము నొసంగుచు) నా యీచిన్నిపద్య మును వ్రాసి నన్ను గారవింపుము.

నృ—(పుచ్చుకొనును)

రా—మంచిది. సిద్ధముగానుంటివా?

నృ—చెప్పుము.

రా— * క॥ త్ప్రాప్వట బాబా తలపై
పువ్వట జాబిల్లి వల్వ ♦ బూచట విసమే
బువ్వట చూడగ నుళుళు
కక్కవ్వట ళ్ళళ్ళ యహాహా నిట్టి ♦ హరునకు జేజే॥

నృ—(ఉచ్చారణానుసారముగా వ్రాయ చేయాడక క్రిందుమీదు జూచును.)

రా—వ్రాయుము! వ్రాయుము! క్రిందుమీదుజూచిన నేమి ప్రయోజ నము? నీయంతటిపండితుం డీపాటి వ్రాయలేకపోవునా? నీశిష్యుల యందధముఁడేవచ్చి యుత్తరువీయగలఁడో లేక నీగురువులలో నగ్ర గణ్యునే తీసికొని రావలసివచ్చునో కొంచెమాలోచించుకొనుము.

నృ—(స్వ) ఇంతకు మున్నెన్ని యో సభలగెల్చితిని. ఎందరినో పండి తుల గోట మీటజాలితిని. కాని యిట్టి వికటకవిని మున్నెన్నడును కని విని యుండలేదు. ఇంతటితో నీతనిబారినుండి తప్పించుకొని పోకయున్న నిఁక బ్రతుకుటయే దుర్లభము.

రా—ఇఁక చాలు నీకు వ్రాతయందుగల సంపూర్ణపాండిత్యము వెల్లడియైనది. ఆపట్టున నది ముగింపుము. ఇఁక తప్పులు దిద్దుటయం దెట్టిప్రజ్ఞగలదో దానినిగూడ సభ్యులు చూడదలంచి యున్నారు. ఇదుగో యీపద్యమునందు తప్పులు దిద్దుము.

మ॥ కననీహారగుపద్మపత్రధళరం♦గ తీక్ష్ణరీచాణూర మ
ద్ధనశుకాశ్రితక్షికళేభరాణ్మృగపతీ ♦ త్రైలోక్యధామోదరా

---

( * నోటితో బాగుగా దీర్ఘముగా ఉచ్చరింపవలెను.)

యనగా శంకరవాంఛితార్థద గదా♦ద్యస్త్రైకపాణీ జనా
ర్థన వాహిప్రద వైరివిగ్రహ ముకుం♦ధా మిత్రవింధాధిపా!

నృ—(చెవులు మూసికొని) రామ, రామ. ఇట్టి యపశబ్దోచ్చారణము నేను వినజాలను.

రా—ఔను! నిజమే! ఈదైవభక్తిప్రాధాన్యమైన పద్యరత్నము నీ పాపిష్టిచెవులకు వెగటుగాదా మఱి! ఇంకను సిగ్గులేక యపశబ్దము లున్నవనుటకు నోరెట్లాడినది. ఏదీ చూతము ఒక యపశబ్దము విడదీయుము.

నృ—చాణూరమర్దన! ధామోదర! యనునవి యపశబ్దంబులుగాక సుశబ్దంబులా?

రా—(కోపముతో) ఓరీ! ఆత్మశ్లాఘాపరాయణా!

చ॥ తెలియనివన్ని తప్పులని ♦ దిట్టతనాన సభాస్థలంబులన్
పలుకఁగ రాకు గోరి పలు♦మారు పిశాచపు పాడగట్ట నీ
పలికిన నోట దుమ్ముపడ ♦ భావ్య మెఱుంగక పెద్దలైన వా
రల నిరసింతురా? ప్రగడ♦రాణ్ణరసా విరసా, ఘుసా, భుసా!

నీకు తెలియకపోవచ్చును. తెలిసినవారినడిగి తెలియుట యుక్తము గాని నోటికివచ్చినట్లెల్ల ప్రేలుట యేనా?

నృ—చాలు చాలు ముందు తిట్టు వెనుక మాటయునా?

రా—కాదా మఱి! వెధవకవిత్వ మన్నపుడు ముందు తిట్టున్నదా మాట యున్నదా? నీవు పండితుఁడవే? పూర్వాపర సందర్భము లాలోచింపక మాట్లాడవలసిన దేనా!

నృ—ఏదీ! నీవు తెలిసినపండితుఁడవేగదా. ఆపద్యార్థము నీవుచెప్పుము చూతము.

రా—నీవు చూచున దేమి, నీపిండాకూడు. అయినను చెప్పెదను వినుము. కనత్=చూడగా; నీహార=మంచుతోగూడి, గు=ప్రకాశించుచున్న; పద్మపత్ర=తామర రేకులవలె; ధళ=తెల్లనై; రంగత్=కాంతిమంతముగు; కీర్తి=యశస్సుగలవాఁడ; చాణూరమత్=చాణూరమంతుఁడనువానిని, హన=సంహరించినటువంటివాఁడ; శుక్రాక్షి కళ=తెల్ల

నైనకన్నులుగల కాళిందుఁడను; ఇభరాట్=ఏనుగు రాజునకు; మృగపతీ=సింహమువంటివాఁడ; త్రైలోక్య=మూడులోకములకు ధామ=నివాసయోగ్యమైన; ఉదరా=పొట్టగలవాఁడ; శం=శుభము లను; కర=కలుగఁజేయువాఁడ; వాంఛిత=కోరఁబడిన; అర్థ=కోరి కలను; ద=యిచ్చునటువంటివాఁడ; గదాద్యస్త్రిక పాణే=గద మొద లగు నాయుధములను ధరించిన హస్తములుగలవాఁడ; జన=జనుల యొక్క; నవ=క్రొత్తవగు; అర్థ=కోరికలను; హిత=హితవులతో; ప్రద=ఇచ్చునటువంటివాఁడ; వైరివిగ్రహ=శత్రుసమూహ మును; ముకుంధా=పోఁగొట్టునటువంటివాఁడ; మిత్=మృత్యు వును; రవింధా=ఆజ్ఞాపించునట్టి; అధిపా=ఓ శ్రీకృష్ణా! అను స్తోత్రపాఠము నీ కర్ణరంధ్రములకు కటువుగానోపినదా? బాపురా! యిప్పటికైనను తెలిసికొనగల్గితివా?

చ॥ ఒకనికవిత్వమం దెనయు ♦ నొప్పులు తప్పులు నాకవిత్వమం
దొకనికిఁ దప్పుపట్టఁ బని ♦ యుండదు కాదని తప్పుపట్టినన్
మొకమటు క్రిందుగాఁదివిచి ♦ ముక్కలువోవని ముక్కు కత్తితో
సిక మొదలంటఁ గోతు మఱి ♦ చెప్పనఁ గొట్టుదు మోము దన్నుదున్.

ఇంక నీ వెంతయు నదృష్టవంతుఁడవు. పో మ్మావలకు పొమ్ము, సభామంటపమున నడుగుబెట్టితివో లేదో! జయపత్రంబులు కావలె, జయపత్రంబులు కావలె! ఈ పాటిపండితునకు జయపత్రంబు లక్కర లేదా మఱి?

నృ—(భయముచే నిలచి నమస్కరించుచు) మహాత్మా రామలింగకవీ!

సీ॥ అగణితమైన ది♦వ్యజ్ఞానమహిమచే
విలసిల్లు నీదు క♦విత్వమునకు
హాస్యశృంగారము♦ఖ్యరసాళిఁ బోషించు
ననమానమగు నీదు ♦ యశమునకును
కృష్ణరాయమహీశు ♦ కీర్తికాంతకు సదా
వన్నెదెచ్చిన నీ ప్ర♦సన్నతకును
కుకవిసమూహదు♦ర్గుణములఁ బోకార్చు
నట్టి నీ వినుల మ♦హత్త్వమునకు

గీ॥ నల్పుఁడను, నీ మహామహి•మాతిశయము
నెఱుఁగఁ జాలని కుమతిని, • శరణుఁబొంది
తయ్య దీనునిఁ గరుణింపు•మయ్య యనఘ
రమ్యగుణసంగ! తెన్నాలి•రామలింగ!

కృ—(ఇరువురిని ఆదరభావమున) ఓ కవిసార్వభౌములార! మీరిరువురు సమానవిద్యాకౌశలులే! మీలో మీకు వైరంబు చెల్లదు. కావున నిఁక శాంతముపొంది మమ్మెల్లర సంతుష్టాంతరంగులగా నొనర్పుడు

పె—రామరాజభూషణా! ఇప్పటికైనను గ్రహింపగల్గితివా? యుక్తాయుక్తవిచారణసేయక ముందుగా దొందరపడుట ఎంతటివానికైనను కీడుదెచ్చును.

రా—(నృసింహకవితో) నృసింహకవీ! నీపై నా కెట్టివిధమగు కోపమును లేదు నీ కవిత్వమునందు మృదుత్వము మెండు. నే నెఱుంగుదును. కాని యాత్మస్తుతి యొనర్చుకొనుట సామాన్యుల లక్షణము.

నృ—(సమ్రతతో) చిత్తము. (సభవైపు తిరిగి)

ఉ॥ లింగనిపిస్తుఁ గల్పులచె•లింగని మేచకకంధరుం ద్రిశూ
లింగని సంగతాళిలవ•లింగని కర్దమదూషిత స్త్రృణా
లింగని కృష్ణచేలుని హ•లింగని నీలకచన్ విధాతృనా
లింగని రామలింగకవి•లింగనికీర్తి హసించు దిక్కులన్.

కృ—(తిమ్మరుసుతో) అప్పాజీ! ఈకవిపుంగవునకు లెక్కకు మిక్కుటంబగుధనమునొసంగి, సబహుమానముగా వారిరాష్ట్రమునకనుపుడు.

(తిమ్మరుసుమంత్రి, నృసింహకవి నిష్క్రమింతురు)

(రామలింగముతో) రామలింగ కవిచంద్రమా!

మ॥ ఉదయాస్తాచలసేతు శీతనగమ•ధ్యోర్వీస్థలిన్ సద్రసా
స్పదవాగ్గుంభన వెల్గు నాంధ్రకవితా•ప్రాగల్భ్యమందెవ్వ నీ
కెదురేరీ ? సరసార్థబోధకలనా•హేలాపరిష్కారశా
రద, నీరూపము రామలింగకవిచం•ద్రా సాంద్రకీర్తిశ్వరా.

మహాత్మా! మీరు నన్ను కోరదగిన దేదైన నున్న కోరు కొనుడు.

రా—రాజా! కోరుమంటివిగాన కోరుచుంటిని. దినమునకు నా యొన ర్పంబడిన నూరపరాధములు మన్నింతునని యభయ మొసంగుడు.

కృ—ఈమాత్రమునకేనా? అట్లే యొసంగితి రండు. (కూర్చుందురు)

ద్వారపా—[ప్రవేశించి] మహారాజా! జోహార్! బిజాపూర్ యేదుల్ శాహిసుల్తానువారిపద్దనుండి యొక వార్తావహుడు వచ్చి దేవర వారి యనుమతికై ద్వారముకడ వేచియున్నాడు.

కృ—లోనికి బంపుము.

(ద్వారపాలకుడు నిష్క్రమించును)

మొన్నటి రాయచూర్ యుద్ధములో యేదులశాహి పూర్తిగా నాచే నోడింపబడియు నాసైనికులను ముందుగా చెల్లాచెదరయుంచుచు జేసి సంధి కొడంబడవలసివచ్చినది. ఈ సంధిసన్నాహములు రాయ చారియగు ఫిగరిడోయాధిపత్యముక్రింద శాసింపవలయునని నిర్ణ యించుకొంటిమిగదా! ఈ వార్తావహుడు సంధితంత్రము గొని వచ్చియుండునా లేక ఆ దుర్మార్గుడు మరల యుద్ధమునకు కాలు ద్రవ్వియుండునా ! (ఆలోచించుచుండగా)

భటుడు—[ప్రవే] సలాం మహారాజ్. యేదుల్ శాహిసుల్తాన్ వారు సంధితంత్రం మీకీ జారీ సెయ్యవాలా అని పంపించినార్.

కృ—సంధి యెట్లుగా నిర్ణయింపబడినది.

భ—మహారాజ్! రాయచూర్ మీ సేతుల్ కిందా హడల్ వాలా మీ సైన్యం మాసుల్తాన్ వారు యిడ్సివేయవాలా. యింకా మహా రాజ్! మీ సేతుల్ కిందీ కవుల్ మా సుల్తాన్ వారికి భారతం మొన్నిదీరోజుల్లో తిర్గముర్గ రాసి అంకితం యివ్వవాలా

కృ—భారతము వారమురోజులలో వ్రాయుట దుర్లభముకాదా?

భ—మాకీ అది హంతా జాంతా నై మహారాజ్! సంధితంత్రంహట్టా పుట్టింది. మాకీ యింకా బోల్తాం సునో మహారాజ్.

కృ—అట్లయిన చెప్పుము.

భ—మీకవుల్ మహారాజ్ మా యేదుల్‌శాహి సుల్తాన్‌వారికి భాస్త్రం రాసేవాలా. హప్డు మా సుల్తాన్‌వార్కి పాండవుల్‌గా రాయవాల. మా సుల్తాన్‌వారి శత్రుర్ 'నైజాండుల్లులాకు' కౌరవుల్‌గా రాయవాల అని హుకుం పుట్టింది మహారాజ్!

కృ—మఱల సది యొక నిబంధనమా?

భ—జౌ మహారాజ్! హుజూర్‌కె పాస్ రోక్సత్ లేతాహుం.

కృ—సరే! మంచిది నీవింక పొమ్ము. (భటుఁడు నిష్క్రమించును)

(కవులను జూచి) కవిచంద్రులారా! ఈయనల్పకార్యమును నిర్వహించి మీపోషకుస క్షేమంబగు తోషంబును గూర్పఁగలరని నమ్ముచున్నాను. అట్లు కానియెడల మఱల యుద్ధము చేయవలస నచ్చును. సైన్యమా యింతకును వేన్నె చాలవరకు నలసియుండెను. ఇంక నీభారమంతయు మీభుజస్కంధములపై నిడితిని. మీచిత్తము.

పె—దేవా! "కష్టధీః కవిజీవితః" యను నార్యోక్తి దేవరవారెఱింగినవిష యమే! భారతమేమి సామాన్యగ్రంథమా? అదియు వారములదిన ములలో పూరింపవలయునట. అందు నీతురకవానిని ధర్మజునిగా వ్రాయవలయునట. ఇదియంతయు జూడ నాకేమియు తోచుట లేదు.

కృ—పితామహా!

గీ॥ అటులఁ గావింపకున్న దుష్టాత్ముఁడైన
యాతురుష్కమహీపాలుఁ డాగ్రహమున
మరల బలములతో నస్మత్తుగాఁగ
దండువిడిసినఁ జేయుకర్తవ్యమేమి?

పె—నాకేదియు కాన్పించుటలేదు. ఈకార్యమును నిర్వహింప సమర్థుఁడు మనరామరాజభూషణుఁడే.

భ—శ్లేషకవిత్వమైనచో నేమైన వ్రాయగలనేమోగాని నన్ను మాత్ర మిందు చేర్పకుఁడు.

రా—(లేచి) ఎవరికివారే నన్నుగాక లెక్కచూచుకొనుచున్న నింక కార్య మెట్లు కొనసాగగలదు? రాజా! వృథాకంఠశోష యేల? ఈభారతమును నేను రచించి ఆ యేదులశాహిసుల్తాను వద్దనుండి మంచి పారితోషికమును తెచ్చెదను. సరియా?

కృ—సెహబాస్ కర్ణరసాయనంబులగు పలుకులు విని ధన్యుడనైతిని.

రా—రాజా! నూరుబండ్లు తాళపత్రగ్రంథములను సిద్ధపరుప వలసి యుండును.

కృ—మంచిది, నేడే ఆయేర్పాటు గావించెదను.

భ—(పెద్దన్నతో) ఈతడు వ్రాయుదునని చెప్పి భంగపుచ్చెడుని గదా.

పె—(జనాంతికముగా) ఓయీ రామరాజభూషణా!ఆతని ప్రజ్ఞావిశేషములు నీకింకను బోధపడలేదా? ఎట్లయినను ఆతురుష్కుని మెప్పించి పారితోషికము గొనుట యేగదా ప్రధానము. ఈతడంబికావర ప్రసాది. ఎట్టికార్యమునైనను నిరాఘాటముగా నెరవేర్పగల సమర్థుడు.

(తెరలో)

గీ॥ అపరదిక్సతి తనకు సంపాప్తమయ్యె
నను సందడిలో బడి ఘనుడు నినుడు
నిజకులాంగన బద్మిని నీటదోసి
పచ్చగుట్టల తేటెక్కి పాఱిపోయె॥

కృ—(విని) కవిపుంగవులారా! వైతాళికులసాయంసమయవర్ణన మెంత రమ్యముగా నున్నది!

పె—ఔను (రామలింగమును చూచి) రామలింగ కవిచంద్రమా! భారమంతయు నీభుజస్కంధములపై బడినది, యేమి చేసెదవో!

రా—శిరసా వహించెదను. (అందఱు నిష్క్రమింతురు)

[తెఱ పడును]

తృతీయాంకము సంపూర్ణము.





శ్రీరస్తు.

# వికటకవి తెనాలి రామలింగ

## చతుర్థాంకము

[రంగము మార్గము: రామలింగము పెద్దన్న భట్టుమూర్తి ప్రవేశింతురు]

పె—రామలింగకవీ! మన రాజుగారి యనుమతి బడసి తురుష్కప్రభువగు యేదులశాహికి భారతము వినిపింపఁదలంచి కదా యరుగుచుంటివి? అందు కొరంత లేకుండ పూరించితివా?

రా—పూరింపకున్న వినిపించు టెట్లు?

భ—(స్వ) ఇయ్యది సర్వము నాకబద్ధముగా దోచుచున్నది. ఈవారము దినములలో నీతఁడు వ్రాయుచున్నట్లు కనబడిన దిన మొక్కటియు లేదు. కావున నీతఁడా యేదుల్‌శాహికి భారతము వినిపించుటయు నబద్ధమే! ఆసుల్తాను వినుటయు నబద్ధమే. ఆ రాయలు నన్నేల యీతనికి తోడిడి పంపవలయును? (ప్ర) రామలింగా! కథ నేరూపముగా మార్చితివి.

రా—తినబోవుచు రుచి యడుగనేల?

పె—సంచిక లెప్పుడు వచ్చును?

రా—బండ్లపై నవి ముందే గొనిపోబడినవి.

భ—పొరపాటు లేకుండ వ్రాసితివా? యేదుల్‌శాహి చండశాసనుఁడు.

రా—వ్రాసిన గ్రంథకర్తమము. అందు పొరపాట్లుకూడ రావలయునా ? చండశాసనుఁడైన మనల నేమి సేయగలఁడు ? రా రావయ్యా.

పె—ఔను ! వేళకూడ నతిక్రమించినది. రండు పోవుదము.

(నిష్క్రమింతురు)

విష్కంభము.

---

[యేదుల్‌శాహి, మంత్రి, సామంతులు కూర్చుండియుండ తెఱలేచును]
(నృత్యానంతరమున)

యే—వజీరే ఆజం భారతం ఆయాహనో షోరాకహ్యాం నహి ఆయా.

వ—సుల్తానే ఆజం, షోరా అభి ఆయింగే.

[రామలింగము పెద్దన్న భట్టుమూర్తి ప్రవేశింతురు]

యే—(సంతోషముతో లేచి) బైటో కవీజ్, సాలాసాలాదూరం నడ్సీ వచ్చార్.

కవులు—అచ్ఛా! అచ్ఛా! (కూర్చుందురు)

యే—కవీజ్, భారతం మాకీ హంతా పూరితీసేశార్, మిక్కిలి సంతోషం. మాకీపాండవుల్ గా నైజాండుల్మెల్కా కౌరవుల్గా రాశారుహనో.

రా—(తాళపత్రగ్రంథ మొకటి చేతబట్టికొని లేచి) చిత్తము. ఈ గ్రంథము బహుశ్రమలకోర్చి వారముదినములలో వ్రాసియుంటిమి. ఇందు సుల్తాను వారిని పాండవులుగాను తమశత్రువులను కౌరవులుగాను వ్రాసియుంటిమి.

యే—అచ్ఛా ! ఆప్ కితాబ్ మాకీ యిన్పించి సంతోషం తిన్పించాలా శాయ్.

రా—(సుల్తాను దగ్గరకు వచ్చి నిలచి) సుల్తానుజీ ! మేము పుస్తకము వ్రాయుట వారముదినములు పట్టినదిగాని యిది చదివి వినుపించుట

కొక ఆరుమాసము లైనను పట్టగలదు. ఇందులో సుల్తాను వారికి బాగా వ్రాసితిమి.

యే—బహుత్ అచ్ఛా (అందఱు సంతోషింతురు)

రా—కాని సుల్తాన్‌జీ! యిందు మాకు కొంచెసంశయము లుండుటచే నీపుస్తకమున కొద్ది వ్రాయమిగిలినది. అది సుల్తాను వారు తెలియ పరచినతో డనే యిప్పుడే పూరించి వినిపించుటకు ప్రారంభించెదను.

యే—క్యాజీ, యింతక్కముందు సెప్తే మాకీ హుకుం జారీసేస్తే యీ ఆల్సం లేకుండా పోయేది.

రా—ఇప్పుడుమాత్రమేమి! సుల్తానారు సెలవివ్వవలయునేగాని కొంచెకాలములో పూర్తిచేసెదను. అదియు చిన్నసంశయమే.

వ—హింత హింత భారతంసేసినా వాళ్లకి యిది హెంత? (రామలింగ మును చూచి) హడ్డండి కవిజీ, సుల్తాన్ వారే సెప్పవాలా మాకీ సెప్పవాలా!

రా—సుల్తాన్ వారే చెప్పవలయును. (సుల్తానును చూచి) సుల్తాన్ ఆజం, ఈభారత మునందు మిమ్ములను పాండవులుగాను, నైజాం ఉల్ముల్కుని కౌరవుల్ గాను వ్రాయవలసినదని తాము హుకుం జారీచేసియుంటిరి. మేమును నట్లే వ్రాసియుంటిమి.

యే—అచ్ఛా మాకీ కావలసిందీ హదీ. క్యాం వజీరే ఆజం.

వ—అచ్ఛా! అచ్ఛా!

రా—అయితే పాండవులనగా ఒకడు కాదు; ఐదుగురు. పాండవులు ఐదుగురికి ద్రౌపది ఒక్కతెయే భార్య. ఇప్పుడు సుల్తాన్ వారిని పాండవులలో పెద్దవాడగు ధర్మరాజుక్రింద వ్రాసితిమి. సుల్తాన్ వారి జనానావారిని ద్రౌపదిక్రింద వ్రాసియుంటిమి.

యే—అచ్ఛా!

రా—సుల్తాన్ వారికి అన్నలు గాని తమ్ములుగాని ఉన్నారా?

యే—నహీం.

రా—లేనియెడల మిగిలిననలుగురుభర్తలను ఎవరిని వేసి కట్ట మందురో సుల్తాన్ వారు సెలవిచ్చినచో నీతక్షణమే యీ, భారతం పూర్తిచేసి వినిపించెదను.

యే—(మండిపడిలేచి) క్యోఁరే, మాజనానావార్కీ మొగుళ్లునీకద్దావ్ రే!

వ—(కత్తిదూసి) క్యారే హెంతపనీ హెంతపనీ సేశావ్ రే !

(పెద్దన్న, భట్టుమూర్తి భయము నటింతురు)

రా—సుల్తాఁజీ సంగతి తెలియక మండిపడెద వేమి? పాండవులనగా ఒకఁడు కాదు (వేళ్లు చూపుచు) ఐదుగురు. ఈఐదుగురకు మాహిందూభారతధర్మశాస్త్రప్రకారము ద్రౌపదిఒక్కతెయే భార్య.

యే—(విసుకుతో) ఛుత్ అయితే మాకీ భారతంకృతీవద్దు గీరతం కృతీ వద్దు, చెలోరే చెలో.

రా—వ్రాసి తీసికొని వచ్చితిమిగదా ఆగ్రంథము నేమిచేయమందురు?

యే—(విసుకుతో) అరే, అల్లా, తగ్లాబెట్టు అయ్యా.

రా—(ద్వారమువైపు చూచి) ఒరే, యెవఁడురా అక్కడ?

ద్వా॥పా—క్యా. మహరాజ్.

రా—నీవు త్వరగా పోయి సుల్తాఁవారియాజ్ఞప్రకారం ఆబండ్లపై నున్న గ్రంథమును తగలబెట్టింపుము.

ద్వా॥పా—అచ్ఛాజీ. (నిష్క్రమించును) (తెఱలో మంట)

రా—సుల్తాఁజీ! వ్రాసినభారతమంతయు తగులబెట్టించితిని.

యే—అచ్ఛా మంఛీపనీ సేసినావ్ భాయ్. నీకీ మంఛీబగుమానంసేస్తా తీసక్పో.

రా—మంచిది. (కూర్చుండును.)

యే—వజీరే ఆజం ఈకవుల్కీ మంచీ బగుమానం సెయ్యి తీసక్పోయి.

వ—అచ్ఛా, (కవులను జూచి) ఆవ్ జీ--

రా—సుల్తాఁజీ మాకు సెలవు యిప్పించండి.

యే—అచ్ఛా! అచ్ఛా!

భ—ఈగండము గడచి గట్టుమీద పడితిమి; ఆంధ్రకవితాపితామహా! యిఁక త్వరగా నడు. (నిష్క్రమింతురు.)

(తెఱ పడును.)

---

## ౨ వరంగము.

[ రాజబాట. తాతాచార్యులవారు ప్రవేశించి]

తా—అబ్బా! యీశైవుల మొగంబుల చూడగూడదని యెన్నివిధం బుల దల దాఁచుకున్నను నెక్కడో యెవఁడో ఒకఁడు కంటబడి నానిష్ఠ సర్వమును భ్రష్టముజేసి విడచుచున్నాడు. ఛీ! ఛీ! అశేషకిల్బిషా రణ్యదవానలుండనగు నే నీశైవకీటకములను జూచి మతవిరుద్ధంబగు కార్యములయందుగూడ ?ోరబడవలసివచ్చుచున్నది. (పైకి చూచి) ఆఁ! వైష్ణవమతాచార్యుఁడను, రాజగురువును అగునేను, ఈస్వల్ప కార్యమునకై యింతగా నాలోచింపనేల? ఇప్పుడే రాయలకడకేగి యీశైవమతస్థులు మన యీస్థానమున నడుగిడుటకు వీలులేదం టినా, ఒక్కయీస్థానములో నన్నమాటేమి యీ పట్టణములోనే యుండుటకు వీలులేదంటినా, ఒక్క త్రుటికాలములో వీండ్రందరు తోక ముడిచి పరుగిడింపవలసినదే. అక్కడితో నీస్మార్తపిశాచములబాధ అఖండమారుతాహతికి కొట్టుకొనిపోవు కారాకులచందమున నొక్క మారుగా మటుమాయమై పోగలదు.

[రామలింగము నెమ్మదిగా ప్రవేశించును.]

తా—(చూచి) ఇదుగో! ముఖల ప్రత్యక్షం, ఛీ! (విసుగుదలతో ఉత్త రీయము ముఖమున కడ్డముగా నిడుకొని) ఈ దురాత్ముని ముఖ మసలే చూడగూడదు. వీడు నన్నశరద్ధకూపమున దింపిన పాపిష్ఠి. సభామధ్యమున నన్నవమానించిన చండాలుఁడు. వంచించి, నా పవిత్ర విష్ణుచక్రాంకితభుజస్కంధములపై నెక్కి స్వారిచేసిన గురుద్రోహి. వేయేల! వీఁడీయూర నడుగిడినది మొదలు నా మెడమీద కత్తివలె దాపరించినాడు. ఇఁక నీ చండాలుని మొగము చూచుటెట్లు?

రా—(తాతాచార్యులవారిని చూచి నవ్వుచు) (స్వ) ఈతనికి పరమత ద్వేష దుర్గుణము బాపవలయునని చాలదినములనుండి తలఁచి సమయముకొఱకు వేచియుంటిని; కాని మీ్మా సాయంసమయము లోగా తగిన ప్రాయశ్చిత్త మొనర్చెదను (తాతాచార్యులవారిని

సమీపించి) ఓహో ! రాజగురువులు మహానుభావులు వైష్ణవ మతోద్ధారకులు స్మార్తమతఖండనోద్యోగులునగు తాతాచార్యులు వారా! (పరికించి) కాదు, కాదు. బాటసారులను ఝడిపింపవచ్చిన వైష్ణవపిశాచం, ఓయెల్లో పిశాచము, బాబో పిశాచము.

తా—(స్వ) వీనియెదుట నేపనిచేసినను కంఠమున కురితగిలించు కొన్నటులే. ఇప్పుడు వీనిని చూడకున్న పిశాచమని కేకలువేసి నన్నవమానింపకమానడు. చూచితినా వీనిముఖము పాడుగాను. నా నియమ మంతయు నీట గలువవలసినదే. సరే యేమైననేమి? (ప్రకా) నేనురా రామలింగా (ముసుగు తీయును)

రా—అయ్యో! మీరేనా? పొరపడితిని, క్షమింపుడు (నమస్కరించును)

తా—(స్వ) నిజముగా వీనికి నాయం దెంతయో భక్తి. సాక్షా ద్వైకుంఠ వాసునివలె కనంబడుదునని అప్పుడప్పుడు చెప్పు చుండెడివాఁడు. వీఁడు నిజముగా వైష్ణవమతమునం దుద్భవింప వలసినవాఁడు. (ప్రకా) నాయనా సుపుత్రప్రాప్తి రస్తు! ధనకనక వస్తువాహనసమృద్ధి రస్తు! శీఘ్రమే—

రా—తథాస్తు.

తా—(నవ్వుచు) యేమిది ఆశీర్వచనము పూర్తికానిదే?

రా—దానికేమి గురువుగారూ! ఇప్పుడు మీరు ముఖమున కడ్డముగా ఉత్తరీయ మేల కప్పుకొనవలసివచ్చినది?

తా—అదియంతయు నీ కెందుల కబ్బాయి నీ దారిని నీవు వెళ్లక.

రా—నాకు తెలిసినదిలెండు. ఈమనయూర నెవ్వరిమీదికో యభిచార మంత్ర ప్రయోగము చేయుచున్నారు. ఈసంగతి నే నీయూరివారం దఱకు చాటింపించెదను. కానిండు. మీ పని మీది నాపని నాది.

తా—(నవ్వుచు) ఓరీ నీ యూహ పాడుగాను. ఇట్టి కొంపలంటించు నూహ లేమిరా నీకు?

రా—నా యూహ పాడుదో, మీ యూహ పాడుదో కొంత సేపటికి తెలియగలదు.

(పోబోవును)

తా—(స్వ) వీఁ డసాధ్యుఁడు. ఏమిచేసినను చేయగలఁడు. ఇప్పట్టున బ్రతిమాలుకున్నగాని లేనిచో ప్రాణములమీదికి తెచ్చిపెట్ట గలఁడు. (ప్రకా) నాయనా! రామలింగా. ఇదుగో ఇటురమ్ము! నేను నిజముగా నట్టివాఁడనో కానో నీకుమాత్రము తెలియదా?

రా—అయితే నన్నుజూచి మీ ముఖ ముత్తరీయముతో నేల కప్పుకొనవలసివచ్చినది.?

తా—రామలింగా! ఇంక నీదగ్గర దాపరిక మేల? నీవు శైవమతస్థుఁడవు. మీ శైవమతము పాపభూయిష్ఠమైనమతము, మావైష్ణవమతము పుణ్యదాయకమైనది యగుటచే మేము శైవులముఖము చూడము. చూచినయెడల గార్దభజన్మ తప్పక సంభవించును.

రా—ఆలాగునా! (స్వ) వీని పాడురోగము బ్రద్దలగుదినము సమీపించినది. (ప్రకా) అయినచో నాసంగతి మొదటనే చెప్పిన నింత కంఠశోష లేకుండెడిదిగా. దానికేమి గురువుగారు? శైవునిముఖము చూచిన తప్పక గార్దభజన్మము సంభవించునా ?

తా—తప్పదు. వైష్ణవాగమములు నిస్సంశయముగాఁ జెప్పుచున్నవి.

రా—అట్లయిన నేటినుండియు నేను శైవునిముఖము చూడనండి.

తా—(నవ్వుచు) ఓరి పిచ్చివాఁడ. నీవే శైవుఁడవై యుంటివిగదా! నీ వింకను శైవునిముఖము చూడకుండు టేమి ?

రా—గురువుగారూ! ఇఁక నాపాప మెట్లుపోగలదు ?

తా—వైష్ణవుఁడవై పూజ్యులగు వైష్ణవమతోద్ధారకులపాదములకు భక్తితో నమస్కరించుచుండుము. పాపము పోయి శుభము కలుగ గలదు. ఇఁక నేను పోయివచ్చెదను.

రా—చిత్తము.

[తాతాచార్యులవారు నిష్క్రమించును]

రా—కానిమ్ము. వీనిగర్వము పరిహారమగుదినము సంప్రాప్తించినది. పరమతద్వేషు లెన్నటికిని పూజనీయులుగారు. వారిట్టి రాజసభలయం దుండుటకు మొదలే యనర్హులు. పరమతద్వేషము భగవద్ద్వేషము. పరమత నిరోధము భగవన్నిరోధము! వీనియాచారము

మండ. మానవమాత్రుఁడై భగవంతునకు వ్రేలు చూపగల సమర్థుఁడా! వీఁడు తనపదవి యెంతవరకో గ్రహింపజా కున్నాడు. గ్రుడ్డుపోయి పిల్లను వెక్కిరించునటుల నీ నీచుఁ ఈశ్వరుని యనల్పసృష్టిపరిభావమున నణుమాత్రమేని గ్రహిం లేకపోగా కొద్దిగొప్పలకు నోర్దికవడి ద్వేషభావముతో నడుగున బడి పోవుచు గురువులని పేర్లుపెట్టుకొని నిక్కి వెక్కిరింతలపాలగు పండిత పుత్రులకే మతవిద్వేషములుండును. తత్త్వజ్ఞులకు మతాంతర సహనమే లక్షణము. రాయలు వీరవైష్ణవుఁడైనను మతాంతరుల యం దాదరణ జూపుచుండును. అతని గొప్పతనమున కిదియొక కారణము. కానిమ్ము, (దూరమున చూచి) అదిగో పెద్దన భట్టు మూర్తు లా మార్గముననే పోవుచున్నారు. వారలను గలసికొని రాయల యాస్థానమునకు పోయి కార్యక్రమ మనుసరించెదగాక.

[ నిష్క్రమించును. ]

3 వ రంగము.

[ఉద్యానవనము. కృష్ణదేవరాయలు, రామలింగము, తాతాచార్యులు, పెద్దన, భట్టుమూర్తి, తిమ్మన ప్రవేశింతురు.]

కృ—నే డెంతటి సుదినము! సత్కవిబృందముతోఁగూడ విహరించు భాగ్యము నేటికి లభించినది. దిగంతులననొప్పు కవిసార్వభౌములగు మీ భుజస్కంధములపై కర్ణాటసామ్రాజ్యప్రతిష్ఠ సుప్రతిష్ఠితమై యుండెనని మా విశ్వాసము.

రా—ఆచార్యులవారిని మఱచిపోతి రేమి ?

తా—[స్వ] వీఁడు మెడతిరుగని కణితి. వీనికి పెద్దయు చిన్నయు నను తారతమ్యమే లేదు. ఇప్పుడు రాయలను శైవమతమారణమంత్రోపాసకునిగా జేయదలంచి యీ విహారమిష నిటకు తోడ్కొని వచ్చిన నా ప్రయత్నమంతయు వమ్ముచేయ, లేగదూడవలె వెంబడించిన వీని నేమనుటకు వీలులేకున్నది.

కృ—స్వామివారల ప్రబోధమే నన్నిటు తోడ్తెచ్చినది.

రా——ఔను, అయ్యవార్ల ప్రబోధము సామాన్యమైనదిగాదు. (స్వ) నేను నియోగించిన గాడిదలకాపరి యింకను రాలేదు. ఈలోపున నేదేని మఱొకప్రసంగములోనికి దింపెదను. (ప్రకా) రాజా! ఆయగపడు తుంగభద్రానదీప్రవాహము కడు రమ్యముగానున్నది. చూడుడు (నదివైపు తిరిగి నమస్కరించుచు) తల్లీ! తుంగభద్రా.

శా॥ గంగాసంగమ మిచ్ఛగించునె మదిఁ ♦ గావేరి దేవేరిఁగా
నంగీకార మొనర్చునే యమునతో ♦ నానందమున్పొందునే
రంగత్తుంగతరంగహస్తముల నా♦రత్నాకరేందుండు నీ
యంగంబంటి సుఖించునేని గుణభ♦ద్రా తుంగభద్రానదీ.

కృ——నిజము! పరిసరంబులగల వనవాటిక జూడుడు.

గీ॥ సకలఫలభరితంబులై ♦ ప్రకటితగతి
నవనవోజ్జ్వలవనలక్ష్మి ♦ చవులఁదేల్పఁ
గోరి పల్లవకరములఁ ♦ జేరఁబిలుచు
నటులఁ దోఁచెడు పాంథుల ♦ నటముటిఁ గని.

రా——కాదా మఱి సాక్షాద్బృధగ్రహామువలె సాక్షాత్కరించిన మన గురుపుగారినిచూచియే వనవాటీవిలాసిని చేసైగచేయుచున్నది.

రా——రామలింగా పడుచువారలకై చేసైగచేయునుగాని ముదుసలిని నేనేల?

తా——తమపాదపూజజేసి తరింపవలయునని.

కృ——బాగుబాగు! కవులతలంపు లమేయంబులు. రం డియ్యెడ కొంఁదికాలము విశ్రమించిపోవుదము.

పె——చిత్తము. [అందఱు కూర్చుందురు]

రా——మీరు నిన్నటిదినమున వినిన మన తిమ్మకవి విరచితంబగు పారిజాతాపహరణంబును విమర్శింపలేదే?

కృ——ఆ విమర్శనాభారము మీపైననే మిగిలియున్నది.

పె—ఔను. పారిజాతాపహరణంబును విమర్శింపదగినవాఁడు మనరామలింగకవియే.

కృ—నిజమే ఆ మహాకావ్యము వినినకొలదియు విన వేడుక జనించుచున్నది. అడుగ మఱచితిని. రామలింగకవిసత్తమా! పితామహుని మనుచరిత్రంబును భట్టుమూర్తిగారి వసుచరిత్రంబును ఈ పారిజాతాపహరణంబును విమర్శింప నెయ్యది ప్రథమస్థానము నలంకరింపఁగలదో చెప్పఁగలరా?

రా—చెప్పుటకేమున్నది. మనపెద్దన్న తన మనుచరిత్రంబున,

ఉ॥ పాటునకింతులోర్తురె కృ♦పారహితాత్మక నీవు త్రోయ ని
చ్చోటఁ భవన్నఖాంకురము♦సోకెఁ గనుంగొనుమంచుఁజూపి య
ప్పాటలగంధి వేదనకు♦పంబిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటినవిచ్చు గుబ్బచను♦మిట్టల నశ్రులు చిందువాఱఁగా.

అని నుడివియున్నాఁడు.

కృ—ఔను! ప్రవరుఁడు వరూథినిం ద్రోసిన సమయమున.

రా—మనతిమ్మన్న తనపారిజాతాపహరణమున,

ఉ॥ ఈసునఁ బుట్టి డెందమున♦హెచ్చిన శోకదవానలంబుచేఁ
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు♦కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయి♦చేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకల♦కంఠవధూకలకాకలీధ్వనిన్॥

అని చెప్పియున్నాఁడు.

కృ—ఆహా! యేమి? సుధాప్రవాహము!

రా—ఇఁక మనరామరాజభూషణుఁడు తనవసుచరిత్రంబున.

శా॥ ఆజాబిల్లి వెలుంగు వెల్లికలడా♦యన్లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమునఁ బటాం♦గ్రంబొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూ♦రాజత్కరాంభోజకాం
భోజీమేళవిపంచికారవ సుధా♦పూరంబు తోరంబుగా॥

అని వ్రాసియున్నాఁడు.

కృ—ఔను! నిజమే! గిరికావిరహమును గూర్చి.

రా—వీనింబట్టిచూడ అల్లసాని పెద్దన అటునిటుగా నేడ్చెను. ముక్కు తిమ్మన్న ముద్దుముద్దుగా నేడ్చెను. కాని మనభట్టుమూర్తి గారుమాత్రము బావురసి యేడ్చిరి. ఏలాగున నేడ్చిననేమి? ముగ్గురు మూడువిధముల బాగుగానే యేడ్చిరి. (అందఱు నవ్వుదురు)

కృ—(నవ్వుచు) వికటకవివిమర్శనము వికటముగానుండుట స్వభావ సిద్ధమేగదా!

(తెరలో)కూఁ హెంఁ. ఒరే!సింగఁడూ ఆకుంటిగాడిద నిటుమళ్లతోలరా!

రా—(విని) గాడిదల కాపరి వచ్చుచున్నాఁడు. ఇఁక తాతాచార్యుల వారి దురభిప్రాయము మటుమాయ మొనర్చెదగాక.

తా—(జనాంతికముగా) రాజా! నేనెంతచెప్పినను నామాట విశ్వసింపవు గదా! ఈస్మార్తులు మహాపాతకులు. వీరిముఖము చూచిన తప్పక గార్దభజన్మము సంభవించును. నామాటవినుము. వీరి నీయూరనుండి తఱిమివేయుము.

కృ—(స్వ) అయ్యో! భేదరహితము పరమపావనము నగు శివకేశవ తత్త్వమును భిన్నపరచి, మాటిమాటికిని నిందించుచు మతద్వేష మును బెరేచు నీయన కేమనిప్రత్యుత్తర మీయవలెనో తోచ కున్నది. (రెండుగాడిదలు ప్రక్కగా వచ్చి నిలుచును)

రా—(పరుగునపోయి గాడిదలకు మ్రొక్కుచుండును)

(అందఱు నవ్వుదురు)

కృ—(నవ్వుచు) రామలింగకవీ! ఇదేమి! నీకేమి మతి భ్రమించినదా? లేక భూతము సోకినదా? గాడిదలకు మ్రొక్కుచుంటివేమి?

రా—(కృష్ణదేవరాయలను చూచి) అయ్యయ్యో! ఎంతమాటాడితిరి? పరమ పవిత్రులగు వైష్ణవమతాచార్యులను జూచి గాడిదలనుట మహాపాతకముగాదా! పైగా నీకుభూతము సోకినదా మతిభ్రమిం చినదా యనుచుంటిరి. ఈ గాడిదలు పూర్వజన్మమున మన గురువులవారి వంశములోనివారే. వీరు స్మార్తులమొగము చూచు టచే వీరి కీజన్మమున నీగతి సంప్రాప్తమైనది. (చూపుచు)

నిజముగా నీయఁడ్డగాడిద మన తాతాచార్యుల వారి పితృ పితామహుఁడు రామానుజాచార్యులుగారు. ఈ కుంటిగాడిద మన తాతాచార్యులవారి పెదతండ్రి రంగాచార్యులుగారు. నామాట యబద్ధముగా దోచెనేని మన యీగురువుగారినే యడుగుఁడు. నేను శైవమతస్థుఁడ నగుటచే నాపాపపరిహారంబునకు గాను వారి పెద్ద లకు నమస్కరించుచుండుమని వారే సెలవిచ్చి యున్నారు. కాకున్న గాడిదలకు మ్రొక్క నే నంత వెఱ్ఱివాఁడనా?

తా—(సిగ్గుచే తల వంచుకొనును)

కృ—(స్వ) ఇది గురువుగారిదురభిప్రాయమును పోగొట్టుటకు పన్నిన పన్నుగడ. ఆహా! రామలింగని కొంటెయుక్తి సామాన్యమైనది గాదు. దురభిమానులయెడ చక్రిధారవలె పనిచేసితీరును. ఇప్పుడు గురువుగారు చిన్నబుచ్చుకొని యున్నారు. వారికి మన శ్శాంతి కలిగింపవలయును. (ప్రకా) అయ్యా! కవిసత్తమా! గురు మర్యాద సుంతయేని లేక ఆచార్యులవారిని నధిక్షేపించినది గాక రాజకీవియన నీదెస కానరాకున్న దేమి?

రా—అయ్యయ్యో! ఎంతటి యవమానకరమగు విషయము! కవిజన పోషకుండగు కృష్ణదేవరాయలయాస్థానంబున పండితుఁడ నని పేరుబెట్టుకొని తుదకు రాజకీవియే యెఱుఁగక పోవలయునా. రాజకీవి యన పొరఁటి నూనెతో వేఁచిన చింతచిగురు, గురుగు, తుమ్మికూర లతో వరిగయన్నము తిని, మంచపుకోళ్లకు గట్టిన ఆవుదూడలు తమ్ము నాకుచుండగా మేకెలువుకుంపటి మంచముక్రింద నిడు కొని, కుక్కిమంచములో కునుకుచుండుటయేకదా? ఈమాత్రమే యెఱుంగకపోవలయునా? (అందఱు నవ్వుదురు)

కృ—(నవ్వుచు) ఔను, నీబోంట్లరాజకీవి యిట్లే యుండును.

రా—ఇట్టి రాజకీవి మాబోంట్లకు సంప్రాప్తమగుట కడుంగడు దుస్త రము. దేవరవారు ప్రభువుల కుపయుక్తమగునటుల వచియించి యుండిరిగాని మాబోంట్ల నాసమయమున మఱచిపోయిరి కాబోలు మాయదృష్టవశమున.

కృ—ఏసమయమున? నేనా?

రా—ఔను, మఱచితిరా? నేను జ్ఞాపకమొనర్చెదలెండు. తమచే రచింపబడిన విష్ణుచిత్తీయమహాకావ్యంబున తాము,

మ॥ గురుగుం జెంచలి తుమ్మి లేదగిరిసాంకం దింత్రిణీపల్లవో
త్కరమున్ గూడఁ బొరంటినూనియలతో • గట్టావికుట్టారి గో
గిరముల్ మెక్కి తమిన్ బసుల్ పొలముపోఁ • గ్రేపుల్ మెయిన్నాకమేఁ
కెరువుల్ గుంపటి మంచమెక్కి గిరిభూభృత్కాష్ఠి రెడ్లజ్జడిన్.

అని వచియించి యుంటిరి కాదా? అదే యిది.

భ—రాయలనే లెక్క సేయని యీమహానుభావు లెవరు జయింపగలరు?

కృ—కవిసార్వభౌమా! నీవు మహానుభావుఁడవు. నీప్రతిభ వర్ణనాతీతము. నాతప్పు మన్నింపుము.

రా—(చేతులు పట్టుకొని) ప్రభూ నిన్ను మన్నింప నేనెంతటివాఁడను.

పె— దేవా ఇంక గృహోన్ముఖుల మగుట మంచిది. రండు పోవుదము.

కృ—మంచిది. ఆచార్య! దయచేయుఁడు.

తా—మంచిది నడువుఁడు. (ముందునకు నిష్క్రమింతురు)

తా—(నిలచి) తగిన పరాభవము జరిగినది. మతద్వేషమెప్పటికిని కూడనిపని. సర్వమయుండగు సర్వేశ్వరునిసృష్టిలో సమముగా పరిగణింపబడుచున్న సర్వమతములను విభజింప నే నెంతటివాఁడను. భగవంతుని మాయాసూత్రజాలంబునఁ దగుల్వడి యీమహాసృష్టిభవనంబున తృణప్రాయుండనయ్యు నహంకారమున నధఃపతితుఁడ నగుచున్నానని భగవంతుఁడీ మహాపురుషుని మార్గమెఱింగింప పంపిన తెఱంగున దోచెడిని. ఈతఁ డసాధారణ ప్రజ్ఞాసంపన్నుఁడు మహానుభావుఁడు వరప్రసాదుఁ డనుట నిస్సంశయము. నన్నావరించిన మతద్వేషమను మహావ్యాధికి జ్ఞానచికిత్స నొసంగి రక్షించిన భిషగ్రత్నము. ఈ మహాపురుషుని భగవానుఁడు సదా రక్షించుచుండుగాక! (నిష్క్రమించును)

యవనిక జారును

చతుర్థాంకము సంపూర్ణము.





శ్రీరస్తు.

# వికటకవి తెనాలిరామలింగ

## పంచమాంకము.

[రంగము అరణ్యప్రదేశము. రంగఁడు సారాయముగ్రోలుచు ప్రవేశించును.]

రం—కీర్తన. సారాఃబుడ్డీ కల్లుగిడ్డీ । నల్లంగుండాలి
రంగఁడుగాడి మర్యా అంతా । రవరవలాడాలి.
లోకం గీకం భూమీ గీమీ । గిఱ్ఱున దిరగాలి
సెట్టుపుట్టల్ గట్టుల్ కొండల్ । దాదూతియ్యాలీ.
అరెరే, అరెరే, లోకం తిరిగిపోతోందిరా, లోకం తిరిగిపోతోందిరా. పటోక్, పటోక్, పటోక్. (కూలబడును)

[సింగఁడు సారాయము గ్రోలుచు ప్రవేశించును]

సిం—కీర్తన. కల్లుముంత చేతిలోన గంతులేస్తుండంగ
ఒకరిజోల్నా కెందుకు నా కొకరితో మాటెందుకు?
సారాబుడ్డి సంకకింద సర్దాపడుతుండంగ
ఒకరిజోల్నా కెందుకు నా కొకరితో మాటెందుకు?
చీకుముక్క దవడకింద చిందులేస్తుండంగ
ఒకరిజోల్నా కెందుకు నా కొకరితో మాటెందుకు?

దానితల్లీచిగ్గొయ్య కాలవలన్నీ కల్లయిపోయి సమదార్లన్నీ సారాలయిపోయి కొండలన్నీ సీకుముక్కలై పోతే

ఒకరిజోల్నాకెందుకు నా కొకరితో మాటెందుకు?

రం—(లేచి) ఓరిసింగన్నా వారెవారె బూమంతా నాకింద గుఱ్ఱమై పోయిందిరా (గుఱ్ఱముపై నున్నట్లు నటించి) చల్. చల్ కల్లు తాగినోడు కైలాసం, సారాతాగినోడు సొర్గలోకం యీగుఱ్ఱాన్నెక్కేరా యెల్లడం.

సిం—ఔన్రా! అందుకనేకల్లుతాగినోడుగనుడు; సారాతాగినోడుసరసుడు.

రం—చల్- చల్. నే నిప్పుడెక్కడి కెల్తుండాను సెప్పుకో

సిం—నాకు తెల్సులే. కల్లుముంతుచ్చుకోడానికి.

రం—అద్దిరా బాబూ బలేమాటన్నావు.

కీర్తన. కల్లుముంతా మాయమ్మ। నువు గౌరిదేవివే
కల్లుముంతా మాతల్లి। నువు లచ్చిందేవివే॥ క॥
కల్లు సారా కల్పికొట్టి। సీకుముక్క చేతబట్టి
చల్లగాను మాపిటేల। యిల్లు దూరి కాటుకేసే॥ క॥

సింగన్నా అన్నట్టమ్మోరిమొక్కుబడి సెల్లించలేదురా అందుకనే యీనెలసరి యేసిన దొంగతనా లెక్కడ పారడంలేదురా.

సిం—యేం మొక్కుబడిరా!

రం—ఆరి దానితస్సాగొయ్యా! అమ్మోరిమొక్కుబడిమాటే మరిసిపోయానంటార్?

సిం—అప్పుడిదా?

రం—ఆఁ ఆఁ అదే. మోతుబరియెంకన్నగారింటో మువ్వలొడ్డానాని కెల్లేటప్పుడు అమ్మోరికి మనిసిపిల్లని బలిద్దామనుకున్నామే అది.

సిం—యేమోరా యీాకిట్టన్నదేబర సింబాసనంమీా దడుగుపెట్టాడు మొదలు మనమ్మోరి సత్తిమే పోయిందిరా.

రం—మారెమ్మ దయే ఉండాలి గాని సత్తిమెక్కడికి పోద్ది? రా! రా! (దూరముగా చూచి) ఉండుండు. సూడమ్మోరిమాత్తెం. మాటలో మాణిక్యంలాంటి పిల్లని జుట్టట్టుకొని యీడ్సుకొత్తంది.

సిం—(చూచి) ఔనారి! అమ్మోరిసత్తెం బలే సత్తెం. కదలకుండా మెదలకుండా కాళ్లకాడికి యీడ్సుకొత్తంగే

రం—ఔనుగాని అది మన్ని సూత్తే యింకొకేపు దాడుతీత్తుంది. కాస్సేపిక్కడ నక్కి కూకుందామురా (దాగియుందురు)

[సుశీలమార్గాయాసముతో ప్రవేశించును]

సు—హా పరమేశ్వరా! విద్యానగర మింకెంత దూరమున నున్నదో! నాపతిపదకంజంబులు కనులార చూచుభాగ్య మెన్నటి కలవడునో! నడచినకొలఁదియు బాట నాతోడనే నడచివచ్చు చున్నట్టు తోచుచున్నది. నావంటి నిరుపేదరాలిజీవయాత్రయుంబోలె నీనిర్జనారణ్యము గడచుట కడుంగడు దుస్తరముగా గాన్పించు చున్నయది. హా హతవిధీ!నన్నేకూరమృగంబునకైనను ఆహారముగా నిడి పున్నెము గట్టుకొనరాదా! (కూర్చుండును.)

[రంగఁడు సింగఁడు ఇరుప్రక్కలనుండియు ప్రవేశింతురు]

రం—కీర్తన. సక్కాని సుక్కరా। నిక్కినిక్కి సూడరా
పక్కారంగు పిల్లరా। బాగైన యింతిరా ॥స॥
యెక్కడ్నించో వచ్చె మన। మొక్కు చెల్లించడానికి
తొక్కిపట్టి మారెమ్మకక్కుర్తి తీరుద్దాము ॥స॥

పిల్లమట్టుగు రవ్వంటి పిల్లరా.

సిం—దీన్ని సూసేసరికి పెళ్లాం గాపకంవత్తందిరా.

రం—నాకు దీన్నిసూసేసరికి వల్లు జిల్లుట్టి కళ్లెంటనీళ్లొత్తున్నయిరా.

సిం—ఒరే ఓమాట సెప్తా కోప్పడవుగంద.

రం—యేంటిరా

సిం—దీన్ని మనిద్దర్లో యెవళ్లమన్నా ఒకళ్లం ముడేసుకొని అమ్మోరికింకొక పిల్లని తెచ్చిద్దాంరా!

## పంచమాంకము

రం—(నోరుకొట్టుకొని) అవ్వ అవ్వ అవ్వ తప్పురా! ముండమోమ్మోరి కనుకుని తరవాత యిట్టాగనుకుంటే మారెమ్మకు కోపం వచ్చి మన్ని గుటకాయించుద్దిరా.

సు—అయ్యో హతవిధీ! నన్నీకిరాతులచేతికి ధారవోసితివా? నా యాశాపాశము చిటుక్కున త్రెంచివైచితివా? నామనోనాథుని దివ్య సుందర విగ్రహము చూచు భాగ్యము నశింపజేసితివా? నానావిధ కుసుమ ఫల విశేషంబులచే నిన్ను పూజించిన ఫలిత మీరీతిని గుడిపించితివా? దేవా! దేవా! నీవు దీనరక్షకుఁడవో దీనభక్షకుఁడవో తెలియకున్నది. అయ్యో! ఈమహారణ్యమధ్యమున నన్ను రక్షించువారెవరు?

సీ॥ పతిపాదములఁ జేరి ♦ బ్రతుకఁ బోయెదునన్నుఁ
గావరే గంధర్వ♦గణములార
రమణునిదివ్యవి♦గ్రహము చూడఁగనేఁగు
నబల రక్షింపరే ♦ యక్షులార
ప్రాణేశు సేవించు ♦ వాంఛతో నేఁగు నన్
సరగఁ బ్రోవరె సూర్య♦చంద్రులార
నాథునిమృదుపద♦నాళీకములు జూడఁ
బోవు నన్ బ్రోవరే ♦ పూజ్యులార
గీ॥ అమ్మ భూమాత! నీబిడ్డ♦నమ్మ దిక్కు
మాలినట్టివంటి పుట్టువు ♦ దాలిచితిని
పతినిఁ గోల్పోయి యగచాట్లు ♦ బడుచునుంటి
తల్లి! రక్షింపుమా పేద♦తనయ నమ్మ. (కూలబడును)

రం—ఒరే! సుబమా అంటూ బలియ్యాలనుకుంటే యేడుపు మొదలెట్టిం దేమిరా యిది? నోట్లో గుడ్డలు గుక్కి బుజాన్నేసుకుందాం పట్టు.

సిం—పాపం దీనికి మొగుడు కావాలంటాంది?

రం—ఛీ! నోరుముయ్. దీని కమ్మోరే మొగుడు.

సిం—కాదురా! యిందాక పాణేశా అంది. పాణేశా అంటే మొగుడు కావాలీ అని.

రం—(సుశీలతో) ఒసే పిల్లా! నువ్వోరువే?

సు—(ధైర్యముతో స్వ॥) కానున్నది కాకమానదు. పరమేశ్వరుఁ డేమి చేయదలంచియున్నాఁడో ముందీకిరాతులయభిప్రాయ మేమో తెలిసికొనియెదగాక (ప్రకా) తండ్రులారా నే నెవరిననియా? ఈమహాప్రపంచమునందే నొక కొఱగాని యభాగ్యదేవతను. ఈయరణ్యమధ్యమున కాలవశమున జిక్కువడితిని. నాయనలారా! మీరెవరో యెఱుంగను. నాకు విద్యానగరమునకు త్రోవ జూపి పుణ్యము గట్టుకొనరా.

రం—ఒరే! యిది దేవతనని సెప్పి మన్ని దడిపించి దొడుతియ్యాలని సూత్తోందిరోయ్.

సిం—యిద్దానగరం మన్నిగూడా తీసికెల్లి రాజుగారికిప్పసెప్పాలనిరా? (సుశీలతో) మేమెవరమైతే నీకెందుకే పిల్లా. నీతో మాకో పనుంది.

సు—నాయనలారా! నాతో మీకేమిపని? మీరెవరో తెలుపగూడదా.

రం—మేమెవరమో గట్టిగా సెప్పమంటావా? మేం దొంగలం.

సు—(ధైర్యము చిక్కబట్టి) కావచ్చును. కాని నావద్ద వస్తువాహనములు లేవుగదా! దయయుంచి నాకు విద్యానగరమునకు త్రోవ జూపి పుణ్యము గట్టుకొనుఁడు.

సిం—నీడబ్బుతో మాకు పనిలేదు. నిన్ను మాయమ్మోరికి బలియ్యాలనుకున్నాం.

సు—(దుఃఖముతో) హా! పరమేశ్వరా అయ్యో! నాథా! (కూలబడి)

గీ॥ నిన్నుఁ జూచెడు భాగ్యంబు ♦ సున్నయయ్యె
నీదుకరుణకు లోనాట ♦ నీటఁ గలసె
హా! మనోనాథ! గుణసాంద్ర ♦ హా! సురూప!
నేటితోఁ దీరిపోవురా ♦ నీదుభార్య.

రం—యేడుత్తా వెందుకు నడువ్వే పిల్ల (సింగఁడితో) ఒరేయ్! నీపై మీద గుడ్డతో దీని మెడకు ముడేసి లాక్కుపద.

సిం—(అట్లు సేయుచుండగా)

రం—(గంతులిడుచు) కీర్తన.

పదవే పోదాము । నారాజనిమ్మాలపండు హా ॥ ప॥
నిధులూ నీరాలు దాటి । పొదలూ పొదరిల్లు దాటి ॥ప॥
జముడూ కాకూలు మంచి । జావిళీలను బాడ
భ్రమతో మాయమ్మోరి। పాదాలముంగలికి ॥ప॥
యేటూకు నీతల । యెగరేసి సరకమా
సాటివోరు లేరంచు । జగదాంబ పలకాలి ॥ప॥

సిం—(లాగి) రా! రాయశ! మొరాయిత్తాం దేమిరోయ్? అమ్మో రేట.

సు—(దుఃఖముతో) హా! పరమేశ్వరా! ఆపద్బాంధవా!

గీ॥ అవనిలో నున్నకష్టము • లన్ని నాకె
కట్టఁబెట్టిన చందానఁ • గన్పడియెడు!
కాని మత్ప్రాణనాథునిఁ • గనులఁ జూచు
కొనెడు భాగ్యమె నోచనై • తిని మహాత్మ!

ఈ మర్మరణము నానాథున కెఱింగించువా రెవరు?

సీ॥ గగనంబుపైఁ బోవు • ఖగములారా మీరు
పతికి మ్రొక్కరె భార్య • ప్రణతు లనుచు
చెట్లకొమ్మలఁ బల్కు • చిల్కలారా మీరు
విభు మ్రొక్కరే సతి • వినతులనుచు
కేలోన్మత్తునమ్మ కో • కిలలార మీరైన
మ్రొక్కరే పతికి నా • మ్రొక్కులనుచు
సాగనుగుల్కెడు మేటి • మృగములారా మీరు
సరసు మ్రొక్కరె పత్ని • సాగిలనుచు

గీ॥ నాకు నానాథునకును ఋ • ణంబు చెల్లెఁ
గానఁ, గడసారి నానమ • స్కారములను
ధవున కందీయరమ్మ వం • దనము మీకు
గగనభూమ్యాది దేవతా • గణములార!

రం—యేడుత్తా వెందుకే ? నడువ్వే పిల్లా!

సిం—రా! రాయశ! (తీసికొనిపోవుదురు)

---

[అరణ్యము. కృష్ణదేవరాయలు కరవాలముతో మృగమును దరుముచు వచ్చి]

కృ—ఏదీ! అరె! ఇంతలోనే మాయమయ్యెనే! ఈ పొదచాటు నుండి యిప్పుడేగదా యిటు వచ్చినది. ఎటు పోయియుండును? ముద్దులుచిల్కెడులేడికూన నొకదానిని తెచ్చియీయుఁడని పదే పదె కోరెడు నాకుమార్తె మోహనాంగి ముద్దుచెల్లింప నీ చిఱుత కురంగంబును వెంబడించితిని. కాని చేజిక్కక పోయెగదా. సైన్యమునుగూడ విడచి చాలదవ్వరుదెంచితి ఇందెందేని డాగియున్నదా? (అటునిటు చూచి) దైవమాయగానున్నది. ఔను. దేనికైనను ఋణానుబంధ ముండవలయునుగదా!

[తెఱలో స్త్రీకంఠస్వరము వినబడును]

కృ—(విని)

ఉ॥ ఏమిది, యీమహాటవిని ♦ నీ యపరాహ్ణపువేళ నీమహా
సామజముఖ్యవన్యమృగ ♦ సంకులమధ్యమునందు, దీనర
క్షామణి! పాహి పాహి! యని ♦ జానకికైవడిఁ గుయ్యివెట్టు, నా
రామ యెవర్తెయో వనికి ♦ రాఁ గతమేమొ గదా! గదాధరా!

అయినను పోయి చూచివచ్చెదగాక!(ముందున కుపక్రమించును)

[తెఱలో కోలాహలము]

కృ—చిత్రముగా నున్నదే! ఈ యరణ్యమధ్యమున నీ యబలారోదనమేమి? పదపడి యీకోలాహలమేమి? ఎవరైన హంతకులేబాలికామణినైన దొంగిలికొని వచ్చిరేమో! ఆహా! దైవనిర్దేశము గోచరాగోచరముగదా! నాపై కర్తృత్వము నిల్పి నాచే నాయబలావతంసమును రక్షింపదలచి కాబోలు నన్నియ్యెడ కీడ్చుకొనివచ్చినాఁడు. రామా! నీభావము గ్రహించితిని. ఇఁక నీయాజ్ఞ శిరసావహించెదగాక! (పరువున నిష్క్రమించును)

విష్కంభము.

---

## ౨ వరంగము.

[దేవాలయమున. మారెమ్మ యెదుట సుశీలను నిల్పి దొంగలు వేపమండలు చేతబట్టుకొని గంతులిడుసమయమున తెఱ లేచును]

దొంగలు - కీర్తన.

మారెమ్మ మరిడమ్మ । మాంకాలీ మాతల్లి!
దయయుంచి మమ్మేలు । దండాలు నీకు.
నిన్ను నమ్మినవోళ్లం । నీయండ జేరామె
కన్నాబిడ్డలలాగ । కాపాడు మమ్మల్ని ॥హే మా॥
కల్లుముంతలు నీకు । కొల్లాగ తెచ్చామె
తల్లీ! మారెమ్మ నీ।సల్లాగనముండాలి ॥మా॥
యేటేట నిను మొక్కి । కోట గట్టిస్తామె,
బాట సూపించి మా।తోటి రావమ్మ ॥మా॥

రం—ఒరే, యాల మించకుండా బలియ్యాలిరా.

సిం—ఒరే, రంగఁడు, భీముఁడు, వెంకన్నా, తిన్నగా నిల్చొండిరా!

[ఇరువైపుల భక్తితో నిలచియుందురు]

సిం—ఒరే వెంకన్నా, ఆగండ్రగొడ్డలి యిటందుకోరా!

వెం—(గండ్రగొడ్డలి యిచ్చును)

సిం—(సుశీలతో) పిల్లా! నిన్న మొన్మరికి బలిత్తుండాం గాని నీ దేవుణ్ణి తలసుకో.

సుశీ—హా! పరమేశ్వరా! ఈ యంత్యకాలమున నాహృదయేశ్వరుని చరణపద్మధ్యానముతప్ప వేఱొండుమార్గము లేదు. కడసారి సంస్మరించెదగాక! నాథా!

గీ॥ నీసతి మహాటవిని నేఁడు నీచమైన
బలికిఁ దొలికాన్కగా నీయఁబడుచునుండె
నైన భగవంతుకృప గల్గు నేని నీదు
నింతిగా నేను మరల జన్మింతుఁగాక!

(భగవంతునుద్దేశించి) దేవా, దీనబంధూ!

మ॥ పరమాత్మా! శ్రితకల్పకద్రుమ! జగద్భద్రైకసంవేద్య! నీ
కరుణన్నేఁ గను జన్మజన్మములకున్ గాళీపదధ్యానత

త్పరుఁడై యుండెను రామలింగనిఁ గృపఁ ♦ బార్వతీశ్వరుండేయుమా
స్మరదూరా! కడసారిప్రార్థనము సు♦మ్మా తండ్రి యీడేర్పుమా.

సిం—యెంకన్నా! దీన్ని పడుకోబేసి కాళ్లుచేతులు కదలకుండా పట్టుకోరా.

సు—హా! పరమేశ్వరా! దీనరక్షకా, ఆపద్బాంధవా, శంకరా!

వెం—(సింగఁడు చెప్పినట్లు చేయును)

సిం—(గండ్రగొడ్డలి పై కెత్తును)

కృ—(తెఱలో)

ఉ॥ హంతకులార? నిల్వుఁడట ♦ నాయువులందలియాస వీడి ని
శ్చింత యమాలయంబునకుఁ♦జెచ్చెరమిమ్మనుపన్ మహోగ్రతన్
బంతముతోడ రాయ లిటె ♦ పర్విడి వచ్చుచునుండె ఘోరదు
ర్దాంతభయావహాప్రభుతఁ ♦ దాల్చి కరాగ్రకృపాణపాణియై.
(ప్రవేశించి)

ఉత్సాహము॥ కండకావ్రుచ్చే మహోగ్ర♦కాననంబునందు దో
శ్చండవృత్తి మండగములఁ♦ సల్పుచుండ రాయ లు
ద్దండమతినిఁ జూచి ఖడ్గ♦ధారలన్ వధింప కె
ట్లుండురా దురాత్మ నీ కిఁ♦కెవ్వఁడడ్డు చూచెదన్.
(పొడుచును)

సిం—ఒరే! యెంకన్నా! చచ్చానోర్యో.

వెం—నే నేమి జెయ్యనురా! బాబు!

రం—(గడగడవణకుచు) పీఁడెక్కడినుంచి దాపరించాడురోయ్ బాబో! అయ్యల్లో బాబల్లో (అటునిటు పారిపోవుదురు)

కృ—పారిపోకుఁడు! పారిపోకుఁడు! మిమ్మందఱి నీశక్తికి బలినీయవలయును.

అందఱు—బాబో! కాలికి బుద్ధి సెప్పండరోర్యో. (పారిపోవుదురు)

కృ—(తెరముకొనిపోయి తిరిగి వచ్చి) అమ్మా! భయంబుడుగుము, ఆ దుర్మార్గుల నందఱిని సంహారించితిని.

సు—తండ్రీ! ఆపత్కాలమున భగవంతునివలె తోడ్పడి నన్ను రక్షించిన తమకు కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నదాన.

(నమస్కరించును)

కృ—తల్లీ! భగవంతునియనుగ్రహమేగాని మానవమాత్రుండనగు నేను నిన్ను రక్షించునంతటి సమర్థుఁడనా? లీలానాటక సూత్రధారియగు జగదేకరక్షకునికరుణకు పాత్రురాలవైన పతివ్రతామతల్లివుగావున నిన్నాతఁడే రక్షించుకొనియె.

తిమ్మరసు—(ప్రవేశించి) రాజా! కృష్ణదేవరాయమహీశా! సైన్యము చెదరిపోయినది. వేటకాండ్రు వేర్వేఱుమార్గములం బట్టిరి. తమరు వెంబడించిన మృగము చేజిక్కినదా!

కృ—లేదప్పాజీ! తత్కారణముఖంబున నీపతివ్రతాశిరోమణిని దొంగలబారినుండి సంరక్షించుటైనది.

తి—చిత్తము! నేటివిహారమున చాల శ్రమగొన్నట్లు తోచుచున్నది.

కృ—ఔను! అప్పాజీ! మీ రీయమ్మను నాకుమాత్రైవడువున భావించి పురంబునకుం గొంపోయి నూతనహర్మ్యంబున విడియజేసి దాసదాసీజనంబులనిడి కడు జాగరూకతతో కాపాడుచుండుఁడు. నేనీమార్గమున పోయి సైన్యమునుకలసికొని పురంబునకరుదెంచెదను.

తి—చిత్తము. [కృష్ణదేవరాయలు నిష్క్రమించును.]

తి—(సుశీలతో) అమ్మా! ఈ సమీపముననే రథమున్నది. రాయలవారి యనుజ్ఞప్రకారము విద్యానగరంబునకు దయచేయుఁడు.

సు—మంచిది. తండ్రీ! (స్వ) నాజీవితమంతయు నొకకలగా గాన్పించుచున్నది. కీడులో మేలన్నట్లు నా ప్రాణేశ్వరుని సంరక్షించుచున్న మహాపురుషుని దయకే పాత్రురాలనైతిని. నా జీవితేశ్వరుఁడు నన్ను మఱచియున్నారనిగదా స్వామివారు సెలవిచ్చియున్నారు. నే నాయనకృప సంపాదించుటెట్లో తెలియకున్నది. దేవి త్రిపురసుందరియే కృపజూచుగాక. [నిష్క్రమింతురు.]

పంచమాంకము సంపూర్ణము.

---



శ్రీరస్తు.

# వికటకవి తెనాలి రామలింగ

## షష్ఠాంకము.

రంగము. రాచబాట.

[సుశీల చతురిక పూజానంతరమున ప్రవేశింతురు.]

సు—చతురికా! కొలఁదికాలమిచ్చోట విశ్రమించిపోవుద ముందుము.

చ—అమ్మా! భవానీదయకై యుపవాసములకోర్చి డస్సియుండియు నింకను నాలసింపనేల? రండు నెమ్మదిగా గృహమునకు చేరుదము.

సు—చతురికా! సతత మా పరమేశ్వరీ చరణకంజ సంజనిత సుధా మరందబిందుసందోహ మానందముగా గ్రోలుచుండ నాకు శ్రమ యెక్కడిది? [తిన్నెపై కూర్చుండును.]

చ—(స్వ) ఈ సకలాంగసుందరి యపరపార్వతివోలె దైవచింతనము తప్ప తదితర మావంతయు నీమెయెడ గానరాదు. ఐనను మఱచితిని. (ప్రకా) అమ్మా! నేను తమ వేడుకచెలికత్తియ నగుటచే నడుగ సాహసించుచుంటిని.

సు—ఏమది చతురికా?

చ—అమ్మా! కోపింపకుందురుగాక! మీ హృదయేశ్వరుఁడు మిమ్ము లను విడచి యెందేని వెడలిపోయినటుల మీ ముఖము చెప్పక చెప్పుచున్నది. ఇప్పు డాయన యెందున్నవారు. ఈ యుపవాస

వ్రతదీక్షాది మహత్కార్యములయందు పాల్గొనుటకు హేతువేమి? తెలియనగునేని......

సు—చతురికా! నా హృదయేశ్వరుఁడీయూరనే నివసించియుండువారు. తదుపరి వ్రతదీక్షాదికములంటివా నే నాయనదయ సంగ్రహించుట కొఱకే. అందును మానుషశరీరము దాల్చిన ప్రతి యువతియు పరలోక సుఖాపేక్షకై నిరీక్షించుచు భక్తజన చింతామణియగు పరమేశ్వరుని చరణయుగమును మనసా ధ్యానించుటయేగదాముఖ్య కర్తవ్యము. ఏతత్కార్యంబున పాల్గొనుటకన్న మర్త్యులకు మఱొండు మార్గముగలదా?

చ—(పరధ్యానముతో వినుచు) లేదు.

కీర్తన.

సు— కాళికావరప్రసాద। జాలమేలరా ॥హా॥
ప్రాలుమాలియుంటిని శ్రీ। రామలింగ పాలింపుము ॥కా॥
విమలమైన నీ పదయుగ। మమలచరిత మదిఁ గొల్చెద
సుమశరజిత చారురూప। సుందరతరగాత్ర -హా- ॥కా॥
హాస్యరసానందభరిత। యనుపమగుణచరిత నీ
దాస్యముచే ముక్తిపదము। దర్శించెద కృపజూడుము ॥కా॥

రా—[దేవీపూజకై పూలసజ్జతో చాటునుండి ప్రవేశించి సుశీలను జూచి స్వ] ఆహా! ఏమి యీ నవమోహనాకారము!

గీ॥ కాకపోతి సహస్రాక్షుఁ♦ గాఁగ కట్ట!
కాంచియుందును గన్నుల ♦ కఱవు దీర
కాకపోతిని శేషుని♦ కరణినైనఁ
బొగడుకొనియుందు నోరార ♦ బుద్ధిదీర.

ఈ గంధగజగమన తన గీతామృతమున నానామమే ప్రయోగించినదే! కారణ మేమైయుండు? (నవ్వుకొని) కాదు కాదు. కామీ స్వతాం పశ్యతి యన్నట్లుండును. (ఆలోచించి) కాని, కాళీవర

ప్రసాద యనియు హాస్యాలాప యనియు నుడివియున్నది. నేనుగాక మరెవ్వరు? ఎదుటబడి తెలిసికొందమన్న పానకములోని పుడకవలె నీ దాసి యొకతె. ఏమిచేయుదును? పోయి పలుకరింతునా? (చూచి) ఆహా! చూచినకొలఁదియు చూడ వేడుక యగుచున్నదే!

ఉ॥ శ్రీకరమైన యాకనులు • చేరలకించుక యెక్కుడౌను లో
కైకనుతుల్ గొనుంగద ముఖాబ్జము క్రొన్నెలవంకతోడుతఁ
దీకొనునట్టి నెన్నొసలు • తీవిగ మేనల మేల్కడానిలోఁ
జేకొనునార యీమదనచిత్రితచిత్రసుగాత్రి గాత్రిపై.

చ—(రామలింగమును చూచి) అమ్మా! పరపురుషు లెవరో వచ్చుచున్నారు. మన మింక గృహంబునకు చేరుటమంచిది. రండుపోవుదము.

రా—(స్వ) ఈ దాసీపుత్రిక నన్నుఁ జూచినట్లున్నది కానిమ్ము, సమయోచితముగా ప్రవర్తించెద.

సు—(చూచి సిగ్గునలేచి) (స్వ) పరులెట్లగుదురు? నా హృదయేశ్వరుఁడే గదా? పోయి కాళ్లపైబడి రక్షించుమందునా? నిరాకరింతురేమో!

రా—(స్వ) ముందుగా నేనే పలుకరించి చూచెదను (ప్రకాశముగా) ఇంతీ!

మ॥ వరబింబాధరముల్ బయోధరములుల్ • వక్రాలకంబుల్ మనో
హరలోలాక్షులు జూప కవ్వలి మొగం • బైనంత నేమాయె నీ
గురుభాస్వజ్జఘనంబుఁ గ్రొమ్ముడియు మాఁకుం జాలవా? గంగ క
ద్దరిమే లిద్దరికీడునుం గలదె యుద్యద్రాజబింబాననా!

చ—(కోపముతో) పురుషాగ్రణీ! రాజాజ్ఞ యించుకేనియు పాటింపక యన్యకాంతలని చిత్తంబున నుత్తలపడక చిత్తమువచ్చినట్లు మాట్లాడుచుంటిరేమి ?

రా—(స్వ) మధ్య నీకాట్లకుక్క దాపరించినదేమి? (ప్రకా) పరిచారికా! నీమాటలు వినిన నవ్వువచ్చుచున్నది. రాజాజ్ఞ యేమిచేయగలదు?

చ—జారచోరాది మహాదానవసములపాలిట చక్రధారవంటి ప్రభుశాసనమే యేమియు చేయజాలదా ?

రా—ఓబోటీ! నీబోటినక్రముల్పై శాసనచక్రము సక్రమముగా నుపక్రమించునేమోగాని మావంటి సుకవిద్విరదంబులపైకి రా నుత్తమ లక్షణముగాదని శంకింపకుందునా?

చ—పదపడి యాలోచించుకొననచ్చును. తాము పిలచిన కారణమేమి?

రా—నిన్ను పిలువలేదే?

చ—నన్ను కాదు. మాదేవినే.

రా—చతురికా! మాదేవినే పిలచినచో నీకేమి?

చ—నాపేరు మీ కెట్లు తెలసినది?

రా—తిమ్మన్న పేరు ముఖమే చెప్పినట్లు నీపేరు నీమాటలే చెప్పుచున్నవి.

చ—అట్లయిన తమ పేరేమి?

రా—నాపేరుతో నీ కేమియవసరము సంఘటిల్లినది?

చ—అవసరమే కానలయునా? మీ పేరు విని సంతోషింపవలయునని.

రా—నీ వంతకోరికతో నాపే రడుగుచుండ నేను చెప్పకుందునా? నాపేరు నామగండు.

చ—పేరుచెప్పుటలోగూడ హాస్యమేనా?

రా—ఓసి! పిచ్చిదాన! యథార్థముగా నాపే రదే. నీతోడ నే పరిహాస మాడుదునా? నా తలిదండ్రులకు తనయులు పుట్టి బ్రతుకక పోవుటచే నేనైనను బ్రతుకుదునేమోయని నా కీ పేరు పెట్టిరి. దైవాను గ్రహమున బ్రతికితిని.

చ—ఏదియెట్లయిన మా కేమి? మీ స్వకార్యంబుపై మీరు చనక యేకాంతంబునగల పరకాంతలతో వ్యర్థ ప్రసంగములు కల్పించు కొనుట తమవంటిపెద్దల కనుచితమగు విషయము.

రా—ఓసీ! దాసీ! మా కుచితానుచితంబులు బోధించునంతటి ప్రాజ్ఞవైతివా? ఎంగిలిమెతుకులు తిని పోతరించిన వాయసమువపువున కన్నులు నెత్తికెక్కినవా? పెద్దయు చిన్నయు తారతమ్యమే కన

బడుటలేదా? దుర్మార్గురాలా! నిన్నియ్యెడ బొట్టు కాటుక పెట్టి పిలచిన దెవరే?

చ—మితిమిక్కిలి మాటలు రానీయకుండు.

రా—ఛీ! ఛీ! నోరుమూయుము.

సు—(చతురికతో) చతురికా! మహాత్ములగువారిమనమును తీవ్రపరుప కుము. దానివలన మనకు శ్రేయోదాయకము కానేరదు. కావున -

గీ॥ తప్పులున్న క్షమించుట ♦ తప్పదనుము
తమకుఁ దెలియని ధర్మముల్ ♦ ధరణి నెందుఁ
గాన మనుము; సమంచిత ♦ మైనదయను
గాంచుటయె యుక్తమని నమ♦స్కారమనుము.

చ—అమ్మా మీరు చెప్పుచున్నారు చాలదా? నేనుగూడ మసి పూసికొని చెప్పవలయునా?

రా—(స్వ) ఆహా! ఈ యబలప్రతిపల్కును డియు తేనె లొల్కు చున్నవే. అందును యుక్తియుక్తముగా నమస్కరించియున్నది. కాన నేనును తగిన ట్లాశీర్వదించెదగాక (ప్రకా) సనలా! నీ తీర్పు బాగుగానున్నది. కావున దానికి ప్రతిక్రియగా నా యాశీస్సు గొనుము.

సీ॥ పైడిగిండులను జెం♦పలు వాయఁగాఁ గొట్టి
నగెడుగుబ్బలకు నా♦స్నత్యమస్తు
విద్యుల్లతకు మొట్టు ♦ వెట్టి తీరుపు దిద్ద
భావించు మెయికి సౌ♦భాగ్యమస్తు
చిఱుతకురంగంబుఁ ♦ జెవిఁబట్టి యాడించు
వరనేత్రములకు నై♦శ్వర్యమస్తు
నీరజారినిఁ బిల్చి ♦ యూరించు మోముకు
శీఘ్రమే శుభవిభా♦సిద్ధిరస్తు
గీ॥ కొదమసింగంబు నేనియుఁ ♦ గొంచెపఱచి
యొప్పు మధ్యంబునకు నిర♦భ్యుదయమస్తు
పడతి! కలహంసమును ముక్కుఁ♦బట్టి యూపి
ప్రబలు నడలకు సద్గతి♦ప్రాప్తిరస్తు.

సు—(సిగ్గున తలవంచుకొనును.)

రా—(స్మృతిగొని) దేవీపూజమాటయే మఱచితినేమి! ఔను. ఈచంద్రవదనమనోహరసౌందర్యకిరణసమూహములచే కన్నులు మిరుమిట్లుగొల్ప దారి కానరామి నే నేమిచేయగలను?

[ముందునకు నడచును]

చ—(స్వ) కాని మిత్రుఁడు నోటికి వచ్చినట్లెల్ల వదరుచున్నాఁడు- ఈవిషయము రాయలవారి కెఱింగించి ఈతని ముప్పతిప్పలు పెట్టించెద. అప్పు డీతని కెట్టిఁ దగ్గుపడగలఁడో చూచెదనుగాక. పదపడి నే నెంగిలి మెతుకులుతిని బ్రతుకు వాయసమునో లేక యశేషశక్తి సామర్థ్యములుఁగల జవరాలనో కన్నులకు బోధపడగలదు. (ప్రకా) అమ్మా! ఇఁక దయచేయుఁడు. ఇప్పటికే త్రిరాత్రోపవాసముచే డస్సియున్నారు. ఇంకను చాలద వ్వరుగవలసియున్నది.

సు—(స్వ) అయ్యో! ఈసుందరమూర్తియగు నా ప్రాణపతిని మరల నెన్ని దినములకు చూడగల్గితిని కట్టా! పోవ కాళ్లాడకున్నవి. ఏమి చేయవలయునో తోచకున్నది.

చ—అమ్మా! దయచేయుఁడు

సు—పోవుదము పద. [నిష్క్రమించును]

రా—హా! ఆ నవమోహనాంగి నా మనఃకుసుమమును దొంగిలించుకొని పోవుచున్నదే! పోవుచున్నదే! తన సౌందర్యకిరణము లుపసంహరించి కురులమాటున డాగిన యిరలు విదల్చి యేతదంధకారమున నన్ను ముంచిపోవుచున్నదే, హా! దైవమా!

ఉ॥ ఈ వనితావతంసమును ♦ నే నెటనో మును జూచినట్లుగా
భావమునన్ స్ఫురించెడు ప్రవృత్తి జనింపక మోహమేల నా
కీవిధి యుద్భవింపవలె ♦ నేమికతంబొ? పురాకృతంపు స
ద్భావ మదేదొ లేకయె వృథా యిటువంటి తలంపు గల్గునే?

[నిష్క్రమించును]

---

## ౨ వ రం గ ము.

[ఆస్థానమున కృష్ణదేవరాయలు, అప్పాజీ, పెద్దన్న, తిమ్మన్న, భట్టుమూర్తి, కూర్చుండియుండగా చతురిక విషాదముతో ప్రవేశించును]

చ—(దుఃఖముతో) ప్రభూ! నమస్కారములు.

కృ—(ఆతురతతో) చతురికా! సుశీల కుశలముగానున్నదా? ఏల దుఃఖించుచుంటివి? ఏమి చెప్పవు?

చ—అయ్యా! ఏమనిచెప్పుదును. నిన్నటిదినమున మేమిరువురము శివాలయమునకేగి వచ్చుచున్న యవసరమున నామగఁడుగారు నా కెదురువడి నానాదుర్భాష లాడుటయేగాక మీదుమిక్కిలి నన్ననరానిమాట లని పోయెను. దేవా! వానిని కఠినముగా శిక్షించినగాని నాయుసురులు నిలువవు.

కృ—చతురికా! నీవలన నేదోషమును లేక నీభర్త నిన్నేల నిందించును?

చ—నా భర్తగాదు స్వామీ! నామగఁడు.

పె—ఔను! భర్తయన్నను మగఁడన్నను నొకటియే యర్థము. మగఁడొకవేళ భార్యను తెలిసియో తెలియకనో నిందించును. అట్టి యవసరమున మందలించుట యుక్తముగాని, యిటుల రచ్చకెక్కి విచ్చలవిడిగా మచ్చుకంటులు హెచ్చరిక సూపుట లోకవిరుద్ధము.

చ—(పెద్దన్నను చూచి సిగ్గుతో) అయ్యా! నామగఁడుగాదు. మీయాస్థానమునంగల నామగఁడు

కృ—(నవ్వుచు) దీనికి వెఱ్ఱియెత్తినదా యేమి? దీనిమగఁడు కాఁడఁట. మన యాస్థానమునంగల దీని మగఁడఁట. దీని కిర్వురుమగలా!

అ—కాదు! ప్రభూ! ఈ చతురిక వచింపనదంతయు భావగర్భితముగా కన్పడుచున్నది.

కృ—(నవ్వుచు) ఏమే చతురికా! వాఁడు నీ మగఁడేనా?

చ—(సిగ్గుతో) కాదు. నామగఁడు స్వామీ!

కృ—వానిపే రేమి?

చ—పేరే నామగఁడు.

కృ—(స్వ) ఓహో! దీనినెవరో మోసపుచ్చుటకై యీ పేరు చెప్పి యుండవచ్చును. (ప్రకా) చతురికా! నీ వాతనిని గుర్తుపట్టగలవా?

చ—చిత్తము.

అ—తదుపరివృత్తాంత మేమి?

చ—మా కాతఁ డెదురుపడి మా దేవితో హాస్యములాడ మొదలిడ నే నగ కూడదనియు, ప్రభుశాసనోల్లంఘన మనియు చెప్పియుంటిని. అంత నాతఁడు ప్రభుశాసన మేమిసేయగలదు? ఎవ రేమి సేయ గలరని కన్నులనుండి నిప్పులు రాల్చుచు నాపై కురుకబోయెను.

కృ—(కోపముతో) సుశీలనే! అంత కన్నులు పోతరించిన మహా మూర్ఖుఁడు, ప్రభుశాసనము పాటింపని రాజద్రోహి, నీచమర్యాదకు పాల్పడిన నీచుఁడు, మాయవేషధారి దోర్గాధుమాయావి, ఎవఁడు వాఁడు! వానిని తక్షణమే నా రాజ్యమునుండి యావలకు నెట్టింప వలయును. అప్పాజీ! వాఁ డెవఁడో ముందు విచారింపుఁడు.

తి—(జనాంతికముగ) పితామహా! ఈ యూర ప్రభుశాసనమే లక్ష్యముసేయక రాజకోపధానలమునకు గురియైన యా మంద భాగ్యుఁ డెవఁడై యుండును?

పె—ఇట్టి కొంటిచేదముల కెల్ల సృష్టికర్తయగు మన రామలింగఁడే కావలయును. అన్యు లింతటి సాహసమున కొడిగట్టుదురా?

తి—ఔ నతఁడే కావలయును. పాపము చేజేతల నింద భరింపవలసిన వాఁడయ్యెనే.

పె—విధినిర్ణయ మెట్లున్నదో అట్లు జరుగకమానదు.

తి—ఔను.

రా—(చిరునవ్వుతో ప్రవేశించి) (స్వ) నే ననుకున్నంతయు జరిగినది. ఈ దాసీ వేసిన పాచిక రాజుగారిని పూర్తిగా పురికొల్పించినది.

రాయలుగూడ నింగలము లుమియుచున్నాఁడు· కానిమ్ము, వీరందఱు నన్నేమిచేయగలరు? చాలదినములనుండియు స్వేచ్ఛయనునది లేక పడియుంటిని. నేటి కీదాసీ బంధవిముక్తుని జేయగలదు.

[నెమ్మదిగా ప్రవేశించును]

చ—(రామలింగనిచూచి) దేవా! ఈయనయె, యీాయనయె మ మ్మవమానించినది.

అ—(చతురికతో) ఇఁక నీవుపొమ్ము. (చతురిక నిష్క్రమించును)

రా—[అర్ధసింహాసనమున నిర్భయముగా కూర్చుండును]

కృ—(కోపముతో అప్పాజీని జూచును)

అ—(లేచి) రామలింగ కవిసత్తమా! తాము మా ప్రభువుచే సంరక్షింపబడి, కుమార్తెకన్నమిన్నగా గారాబమున జూడబడుచున్న సుశీలయను నామెను వినరానిమాట లనియుంటిరని యీా చతురికవలన తెలియవచ్చుచున్నది.

రా—(చిరునవ్వుతో) ఈ చతురికమాటలకు మీా చతురుఁడు చెవియొగ్గుటచేతనే యీా చతురత్వము సంభవించినదని నేను మున్నే గ్రహింపగల్గితిని. ముందు జరిగినతీర్మానము విన వేడుకపడుచుంటిని. అదిగూడ వినిపించి సంతోషపరుపుఁడు.

కృ—(కోపముతో) ఓయీా! నిరభిమానీ!

శా॥ నారాజ్యంబున లేనిపోనివగు న♦న్యాయ్యంబులన్ నెత్తిపై
కీర్తిన్ దగఁదెచ్చిపెట్టుటలు నీ♦కే చెల్లె మర్యాదకున్
దూరంబంచుఁ దలంప వింతయును నిన్ ♦ దూషింప నోరాడ దీ
తీరుల్ మేము భరింపలేమనుటయే ♦ తీర్మాన మిప్పట్టునన్.

రా—(కోపముతో దిగ్గున లేచి) ఓ రాజా!

చ॥ పదవు లశాశ్వతంబు లవి ♦ పట్టినయంతనె గర్వశీలివై
వదరుట పాడిగాదు జన♦పాలక యవ్వి తలంపుమాత్రనే
వదలిచనున్ మహాత్ములను ♦ వంచనచేసిన దెంతలాగినన్
విదులదు మంచిచెడ్డలను ♦ వీడి చరించుట మోసమాఁ జుమీా.

రాజా ! మరొక్క మాట.

ఉ. గద్దియపైననుంటినని ♦ గర్వముకూడదు సుమ్మి యింక నీ
సుద్దులు హద్దుమీరె నిను ♦ జూచుట కష్టతరంబు నాకికన్
బెద్దయుఁ బిన్నయన్ దగవు ♦ వీడి చరించెదు తావునుంట నా
కొద్దికగాదు బుద్ధిగొని ♦ యుండుము నే నిఁకఁ బోయివచ్చెదన్.

(అందఱు నిశ్చేష్టులగుదురు)

రా—(చిరునవ్వుతో) వచ్చినదారినే వెళ్లిన మంచిదనిరి పెద్దలు.

(నిష్క్రమించును)

కృ—అప్పాజీ! పవిత్రియగు ఆ సుశీలపూర్వవృత్తాంతము వినియుండ లేదే?

అ—చిత్తము. రేపటిసభయందు విచారించుట యుక్తమని తోచుచున్నది. ఘంటానాదము కూడ వినవచ్చుచున్నది.

కృ—మంచిది, కానిండు. (కోపముతో నిష్క్రమించును)

(అందఱు వెళ్లుచున్న సమయమున)

పె—కట్టా! నేటిసభ విషాదాంతముగా మారిపోయిన దే!

తి—పితామహా! కాంతాకనకములే గదా, కలహకారణములు.

పె—చిత్తము. (నిష్క్రమింతురు)

షష్ఠాంకము, సంపూర్ణము.

---



శ్రీరస్తు.

# వికటకవి తెనాలిరామలింగ



## సప్తమాంకము



[రంగము ఆస్థానము, కృష్ణదేవరాయలు, అప్పాజీ, పెద్దన, తిమ్మన, భట్టుమూర్తి ప్రక్కగా సుశీల, చతురికయు ప్రవేశింతురు.]

కృ—అమ్మా! సుశీలా! కుశలముగా నుంటివా?

సు—తండ్రీ! భవదనుగ్రహమున కుశలముగానే యుంటిని.

కృ—అమ్మా! ఆనాఁడు వ్యవధిలేక తెలియనైతిని. నీపూర్వవృత్తాంత మించుక వినుపించెదవా?

సు—తండ్రీ! దుఃఖభాజనమైన నాపూర్వ వృత్తాంతమే వినవేడుక జనించినదా! ఆయజుఁడు తన సృష్టిభవనమున గల కష్టములన్నియు ముద్దజేసి నన్ను సృష్టించియుండనోపు! నాజీవితమంతయు దుఃఖావహమై యెంతటికఠినహృదయమునైనను నీరుగా ప్రవహింపజేయక మానదు. నేను చిన్నతనముననే తల్లిని గోల్పోయితిని. పిదప నాతండ్రి నన్ను కడు గారాబమున పెంచి తెనాలియందొక భాగ్యవంతునికోడలునిగా నొనర్చెను. ఆమహాపురుషుఁడుగూడ స్వర్గస్థుఁడయ్యె. పదపడి నామామగారొక్కనాఁడకస్మాత్తుగా దివంగతులంకరించిరి. నాహృదయేశ్వరునకు వెఱ్ఱి సంభవించి యాయన పలాయనులైరి. ధనమంతయు తస్కరులచే హరింపబడినది.

కృ—హరిహరీ! తదుపరి?

సు—తదుపరి దైవానుగ్రహమున, నాపతికి నిత్యానందస్వాములవారు దర్శన మొసంగి కాళీమంత్రోపదేశ మొనర్చి ధన్యునిగా నొనర్చిరి.

తి—పితామహా! నిత్యానందస్వాములవారు మన రామలింగకవి గురువుగారని వినియుంటిమి?

పె—ఔను.

సు—పదపడి యేతన్మంత్రోపదేశంబుకతన గల్గిన త్రిపురసుందరీ కృపారసాస్వాదనముచే సకల విద్యాపారంగతుండై దివ్యత్వంబును పునర్జన్మ ధరించి యీ విద్యానగరంబునకు జేరిరి.

పె—(జనాంతికముగా) ఈ యంగన రామలింగనియర్ధాంగియో యేమి?

తి—నామనస్సునకు నట్లే తోచుచున్నది.

సు—తదుపరి నేను నాపతిని గానక వెదకి వెదకి వేసారి నిరాశాసూచన లుదయింప జీవితాశాపాశమును ద్రెంచివైచి యాత్మహత్యకు గడంగితిని.

కృ—(చెవులు మూసికొని) శ్రీహరీ! అంత?

సు—అంత నాపాలిటి ధర్మదేవతయో యనునట్లు, నిత్యానంద స్వాములవారు దర్శనమిప్పించి నాక్రూరకృత్యము వారించి, నాపతి దేవీవరప్రసాదంబున పునర్జన్మ ధరించుటయు, నన్ను మఱచుటయు, మీపురంబునకు జేగుటయు నాదిగా వచించి 'నీవుగూడ విద్యానగరంబు జేరుట శుభ'మని చెప్పుచు నదృశ్యులైరి.

కృ—మహాపురుష సందర్శనమున ధన్యవైతివి. తదుపరి?

సు—తదుపరి నేనబలనయ్యు నాహృదయేశ్వరుని చరణపద్మధ్యానమే నాకు తోడురా నిర్జనారణ్యమునైనను లెక్కసేయక యిలు బయలు వెడలి యీవిద్యానగరంబున కరుదెంచు మార్గమధ్యమున దొంగలు నన్నీడ్చుకొనిపోయి మరిడికి బలినీయ సిద్ధపడిరి. ఏతన్మరణావస్థ నుండి దయామయులగు తమచే రక్షింపంబడి యిచ్చోట సంరక్షింప బడుచుంటిని.

ఆకాశవాణి—సత్యము.

కృ—(విని, తిమ్మరుసుతో) అప్పాజీ! అశరీరవాణి యీయమపల్కులెల్ల సత్యములని తెలియపరచుచున్నది వింటిరా!

అ—ఔను! ఈసాధ్వీపూర్వవృత్తాంత మెంతయు విషాదజనకము.

కృ—కాని ఈమెభర్తృనామమెద్దియో తెలియలేదే!

అ—(సుశీలతో) అమ్మా! ఇప్పుడు నీపతి యెందున్నదియు తెలియవచ్చినదా?

సు—నాయనా! వారు తమయాస్థానమునగల కవిదిగ్గజములలో నొకరుగా పరిగణింపబడుచు పేరెన్నికగన్న హాస్యరసప్రధానులుగా నుండిరని వినియుంటిని.

పె—(జనాంతికముగా) మనయూహ వ్యర్థముగాలేదు. పాపముసుగుణశీలయగుసుశీల కింకను కష్టదినములు వెంబడించుచునేయున్నవి.

తి—ఆభగవంతుఁడు పవిత్రహృదయములనే గదా తఱచి నిగ్గుదీయుచుండును.

కృ—హా! రామచంద్రా! తాఁ దలఁచినదొకటియు దైవము తలంచునది వేరొకటియు ననుట నాయెడనే విస్పష్టమయ్యెనే. హా! ఈపుణ్యదంపతుల నొండొరుల విడదీసిన మహాపాతకము నానెత్తిపైకి తెచ్చిపెట్టిన నిన్నేమనగలవాఁడను? నాయీనింద భూమిపై తారార్కస్థాయిగా కాపురము సేయవలసినదేనా! అయ్యో! నాబుద్ధి పాడుగాను. ఎంతటి దుష్కార్యమునకు సాహసించితిని. ఆమహాపురుషుని అనన్యసామాన్యగుణకోవిదుని ఆదుర్జనదుర్గమదుర్వారగర్వాపహారుని మారామలింగకవిధీరు నింక నాకన్నులతో జూచు భాగ్యము గలదా? రామలింగా! (సుశీలనుచూచి) అమ్మా! సాధ్వీ! పురంధ్రిరత్నమా?

సీ॥ పతితపావని నిన్నుఁ ♦ బతికి దూరముజేసి
బ్రతికియున్నట్టి దు♦ర్జనుఁడు వీఁడె
దయ యింత లేక నీ♦ధవుని యూర్వ్యోడలింప
శాసించినట్టి ము♦ష్కరుఁడు వీఁడె

అరయ నవ్వులబండి♦యైన నీనాథుని
పోఁగొట్టుకొన్న దు♦ర్బుద్ధి వీఁడె
నిర్మలహృదయుని ♦ దుర్మార్గుఁడని లోనఁ
దలఁచిన ఘోరపా♦తకియు వీఁడె

గీ॥ ఆమహాధీరుఁ డేఁగిన ♦ యంతనుండి
చిన్నవోయిన సభఁ జూచు♦చున్న వాఁడు
వీఁడె వీనిమొదల్ దయ♦ వీడి సాధ్వి!
శాపమొసఁగి కృతార్థుఁగా ♦ సల్పుమమ్మ.

సుశీ—(నిశ్చేష్టయై) హా! నాథా!

కృ—(స్వ) హా, రామలింగా! నిన్నన్యాయముగా చతురికమాటలు విని నిందించితినని యీ నిరాయలపై చలమువహించి యెందేఁగితివి? అయ్యో! మహాపాతకి చతురికయే యీ మహాప్రళయమునకంతకు మూలము. (చతురికను చూచి) ఓసీ! దాసీ! నన్నన్యాయముగా నిందాభాజనునిగ జేసిన నిన్నిదే మదీయఖడ్గమున కెఱగా వించెద. (ఖడ్గము నొఱనుండి తీయును)

అ—ఆఁ, ఆఁ, రాజా! ఏమీసాహసము! (కృష్ణదేవరాయల చేయి పట్టుకొనును)

చ— (భయపడుచుండును)

కృ—అప్పాజీ! నన్ను వారింపకుఁడు. ఈ మహామారివలననే పవిత్రహృదయుఁడగు రామలింగని గోల్పోతిని.

అ—రాజా! రాజులు తమప్రతాపము లబలయగు దాసీపుత్రికపైనా చూపుట?

కృ—అప్పాజీ! నన్నిప్పు డేమి చేయుమందురు. నే నా మహాత్మునేల తూలనాడితిని! (ఖడ్గమును పాఱవేయును)

అ—ప్రభూ! గతజలసేతుబంధనమేల! చారులం బనిచి వారెందున్నదియు తెలిసినపిమ్మట నెట్లైనఁ దోడ్కొని రావచ్చును.

సు—హా, నాథా! నీచరణపద్మ ధ్యానయగు నీసుదతికి నీపదకంజంబులు

జూచుభాగ్యము లేదుకాబోలు. ఈ నిర్భాగ్యురాలు అంతటి నోము నోచికొనలేదుకాబోలు. హానాథా!

కృ—తల్లీ!

మ॥ కలఁతఁ బొందకుమమ్మ నీమనమునన్ ♦ కళ్యాణి, యే నిప్పుడే
నలుదిక్కుల్ గనఁ జారులన్పనిచి నీ♦నాథున్ యశశ్శ్రీనిధిన్
లలనా! శ్రీహరిపాదసాక్షిగను నే♦ రప్పించెద న్గానిచో
జ్వలనజ్వాలలఁ జేరి, దేహమునునన్ ♦ జాలించెదన్ తల్లిరో!

అ—(చతురికతో) చతురికా! ఈ యమ్మను గృహంబునకు తోడ్కొనిపోయి కడు జాగరూకతతో కాపాడవలయును. లేదేని నీప్రాణములు నీకు దక్కుట దుర్లభము.

చ—తుదకు గోడదెబ్బయు చెంపదెబ్బయు నాకే. (సుశీలతో) అమ్మా దయచేయుఁడు. [నిష్క్రమించును]

కృ—అప్పాజీ! తత్క్షణమే చారులను నలుదిక్కులకుం బంపి యాం మహాపురుషుని తోడ్కొని వచ్చువారికి గొప్పపారితోషిక మిత్తుమని ప్రకటింపుఁడు.

అ—చిత్తము.

ద్వా—(ప్రవేశించి) హే కళింగరాణ్మణీ! జోహార్!

కృ—దౌవారికా విశేషములేమి?

ద్వా—దేవా! సమస్తవిద్యారహస్యవేదియు కవికులచూడామణియు నైన భట్టరాచార్యులవారు విచ్చేసి తమ సెలవునకై యెదురు చూచుచున్నారు.

(కవులు నివ్వెరపడి చూచుచుందురు)

కృ—దౌవారికా, వారిని త్వరగా లోనికి తోడ్కొనిరమ్ము.

ద్వా—(నిష్క్రమించును)

పె—(లేచి) రాజా! నేటితో మీకును మాకును ఋణంబు చెల్లెననుట యథార్థము. ఈభట్టరాచార్యుని జయింప మాకు సాధ్యపడదు సరి కదా, ఆసహస్రశీర్షునకైనను ప్రక్కబెదరుగానే యుండును. ఈతని

పేరు విన్నమాత్రమున కవులహృదయములు గగ్గోలు పడక మానవు.

భ—రాజా! నా కొక యుపాయము తోఁచుచున్నది. ఈయనతో వాక్కలహమునకు జొచ్చునెడ మాలో నొక్కరుఁడును జయించుట దుర్లభము. కావున నీకవికులసింహుని నెక్కుడుగా సత్కరించి పంపివేయుటయే యిప్పటున నుచితముగా తోఁచుచున్నది.

తి—ఔను! ఈసమయమున నదియే సమంజసముగా గన్పడుచున్నది.

పె—కట్టా! ఇప్పట్టున

చ॥ ఉరుమతి రామలింగకవి ♦ యుండిన నీతని వాగ్వివాదమం
దరనిముసంబున న్గరువ ♦ మంతయు డించి యథేచ్ఛగాఁ బొరిం
పొరిఁ బుబాహ్యదేశముల♦పొంతకు గెంటక యున్న యక్కటా
యొరు లెవ రీతనిన్ గెలువ ♦ నోపరె యెవ్విధి పెన్గులాడినన్.

కృ— హా! రామలింగా! నిన్ను నిందించిన పాపఫలము వెంటనే ప్రత్యక్షమైనది సుమా!

భ—భవిష్యత్కర్తవ్య మాలోచింపక అందనిమాత్రకుల కట్టుజాపుచు గూరుచున్న నేమిప్రయోజనము? అదియునుగాక ఇంతమంది దగ్గరగల్గి యేమియు జేయలేకుంటిమిగాని యిఁక నెక్కడనో యున్న రామలింగ మరుదెంచి మనల నుద్ధరింపగలఁడా?

పె—ఓయీ! భట్టు! ఇఁక గుట్టును కట్టివేయుము. ఆచార్యులవారు వచ్చుచున్నారు.

[భట్టరాచార్యులు ప్రవేశించును. కృష్ణదేవరాయలు, అప్పాజీ, కవులు నిలువంబడుదురు]

కృ—'అడియేన్ దాసాన్' (నమస్కరించును)

భ॥ చా—రాజా! జయమగుగాక జయమగుగాక!

కృ—ఆచార్యా! ఈయుచితాసన మలంకరింపుఁడు.

[ భట్టరాచార్యులు కూర్చుండగా మిగిలినవారు కూర్చుందురు. ]

కృ—దేవా మీయాగమనంబున మద్గృహము పావనమయ్యె. నే ధన్యుఁడనైతిని.

భ॥చా—రాజా! నీయాస్థానంబున గల కవులను జయించి నీవలన ఒక గొప్ప పారితోషికమును గ్రహింపవచ్చితిని.

కృ—ఆచార్యా! భవదీయ కీర్తిమహిమావిశేషంబు లెల్లరకు తెల్లమైన విషయమే. అందును గురుసమానులు. మీరు వేఱుగా జయింపవలయునా? మీరుకోరు పారితోషికము తప్పక యొసంగ సంసిద్ధుఁడనై యుంటిని.

భ॥చా—ఓరాజా! నీవు సత్యశీలివి, పండితపోషకుఁడవు. కావున నే నిన్ను యాచించుచుంటిని. నీవు నీ సప్తాంగయుతం బగు రాజ్యమును దయసేయుము.

[కవులు నివ్వెరపడుదురు. కృష్ణదేవరాయలు తిమ్మరసును జూచును]

అ—రాజా! మీపితృపితామహులనుండియు మీ యింట సత్యదేవత కాపురము చేయుచున్నది. ఆమెకు కళంకము తెచ్చిపెట్టకుము.

కృ—(భట్టరాచార్యులను చూచి) ఆచార్యా! తమవంటి మహాపురుషులు కోరుటయు నేను లేదనుటయునా? ఇదే నా సప్తాంగయుతంబగు రాజ్యమును మీకు స్వాధీనపఱచెదను. ఇంక తాము సింహాసన మధిష్ఠించుటకు తగు సుముహూర్తమును జూడుఁడు.

భ॥చా—(యోచించి) నేటికి వారముదినములలో నొక సుముహూర్తము గలదు. నే నానాటికియ్యెడ కరుదెంచెదను. పట్టణమంతయు నలంకరించియుంచుఁడు.

కృ—చిత్తము. [భట్టరాచార్యులు నిష్క్రమించును]

కృ—అప్పాజీ!

శా॥ తీరెన్ బ్రాప్తము నేఁటితో మనకుఁ బృథ్వీభార మాచార్యుపైఁ
జేరన్ వేసి యథేచ్ఛఁ బోయెద దయాసింధూ! ననునోచె మీ
రారాజున్ దయఁ గొల్చుచుండుఁ డిఁక పై న్యాయక్రియన్ నన్నుఁగ
న్నారన్ బిడ్డఁగఁ జూచినట్టి మిము నేనశ్రాంతమున్ మ్రొక్కెదన్॥

అ—రాజా! నీవులేనిచోట మేముమాత్రముందుమా? వారి సప్తాంగములు వారి కొసంగిన పిమ్మటగదా మనమందఱము కట్టగట్టుకొని యేగంగాయాత్రనైనను సేవించుట! ఇప్పుడేమి తొందర?

కృ—పితామహా! మీరీవిషయము పురవాసులందఱకి ప్రకటింపజేసి పట్టణ మలంకరించి తగు ప్రయత్నమున నుండుఁడు.

పె—హా! పరమేశ్వరా! తుదకెట్టి విపత్తు తెచ్చిపెట్టితివిరా?

[విచారముతో కవులు నిష్క్రమింతురు.]

చారుఁడు—(ప్రవేశించి) దేవా! నమస్కారములు.

కృ—గూఢచారా! విశేషములేమి?

చా—రామలింగకవి యతివేషము ధరించి కాశీయాత్ర సేవించుటకై పోవుచున్నారఁట! ఇప్పుడు మనము తరచు వేటకు బోవు నిర్జనారణ్యముసమీపమునకు జేరియుందురు.

కృ—ఇఁక నీవు పొమ్ము. [చారుఁడు నిష్క్రమించును]

కృ—అప్పాజీ! ఆకవిసత్తముఁడీ నిర్జనారణ్యము దాటిపోవుటకు మూఁడుదినములేని పట్టగలదు. ఈలోపున నే నా మహానీయుని గలిసికొని తప్పు మన్నింపుమని ప్రార్థించి పురంబునకు తోడ్కొని వచ్చి యీశుభముహూర్తమున నీసుశీల నాతనిస్వాధీనపఱచితినా, కలయాటంకములన్నియు తీరగలవు? తదుపరి నే మునివృత్తి నవలంబించినను స్వేచ్ఛావృత్తిని విహరింపగల భాగ్యమబ్బును.

అ—కట్టా! తుద కెట్టి యన్నములకు లోనుగావలసివచ్చెను?

కృ—అప్పాజీ! ఇప్పుడు నేను మునివేషమున ఆమహానీయుని సందర్శించుట యుక్తమని తోచుచున్నది.

అ—చిత్త మట్లే సేయుఁడు. [నిష్క్రమింతురు]

## ౨ వ రంగము

(అరణ్యమున రామలింగము యతివేషమున ప్రవేశించును)

రా— రాజా! నీచెంతలేని నిముష మొక యుగముగా దోఁచుచున్నది గదా? అయ్యో, నీవు నాపై కినుకబూనుట కా నవమోహనాంగియే కారణము. ఐన నదేమిచిత్రమోగాని అన్యకాంతలనిన నీసడిచెందు నాపవిత్రహృదయ మాయువిదనుచూచిన దాది వెఱ్ఱికుక్కయైపోయి నదేమి? ఇంతకును నేమికావలసియున్నదో గాని, ఆహా!

సీ॥ అలికులవేణినె • య్యంపు వాక్సుధచేతఁ
దనిసెడునాఁడుగా • ధన్యుఁడగుట
బింబోష్ఠియధరామృ • తంబు నాస్వాదించి
మత్తిల్లునాఁడుగా • మంచిదగుట
మగువ కప్రఁపుటాకు • మడుపు లందించి నన్
బ్రేమించునాఁడుగా • పెద్దనగుట
విద్యుల్లతాతన్వి • వేడుకతోఁ జెంత
వెలయునాఁడుగదా ప • విత్రమగుట
గీ॥ ఇన్నిఁటికి మూలమా పర • మేశ్వరుండు
కరుణఁ జూచిననాఁడుగా • తిరముగనుట
అంత భాగ్యంబు సిద్ధించు • టౌనొ కాక
యాస లడుగంటి చనునొ ని • రాసగాఁగ.

(దూరమున జూచి) ఆవచ్చుచున్నదెవరు? నూతన సన్న్యాసివలె కన్పట్టుచున్నాఁడు. మా యిరువురకు జతకలసిన బాగుండును.

కృ— ఆహా! ఎంతటి చిత్రకల్పనము!

శా॥ కట్టా! మేరుమహీధరంబుఁ దృణముం • గాఁ జేసి తల్లేశమే
యెట్టో స్వర్ణనగంబు సేయునని ము • న్నేవిందు నాదృశ్యమి
ప్పట్టున్ నాయెడనే కనంబడియె దు • ర్వ్యామోహాతన్ బెద్దలన్
దిట్టన్ దత్ఫల మూరకే విడునె ప్రా • గ్దిగ్దేవునైనన్ దుదిన్.

ఇప్పుడు రామలింగకవి యీప్రాంతమునుండియే తపోవేషమున యాత్రకు పోవుచున్నాడని వినియుంటిని. ఆశాంతమూర్తిని ఆయానంద మయుని యెప్పటికిచూడగల్గుదునో? (పరికించి రామలింగని చూచి) ఈ మునితిలకుఁ డెవరో ? ఈతనివలన మారామలింగకవివృత్తాంత మేమైన తెలియగల దేమో! (సమీపించి) మహాత్మా! నమస్కారములు.

రా—శుభంభవతు (స్వ) ఈయనను చూచినకొలందియు నాహృదయ మున గాఢానురాగ ముదయించు చున్నది. కారణమేమైయుండును. (ప్రకా) అయ్యా! తమరాక యెందుండి?

కృ—మహాత్మా! నేను విద్యానగరము నుండి వచ్చుచున్నాడను.

రా—ధన్యుఁడవు. నాయనా కవిజనపోషకుండును, నుదారస్వభావుఁ డునునైన శ్రీకృష్ణదేవరాయలుఁవారు కుశలమా?

కృ—మహాత్మా! ఆకృష్ణదేవరాయలు తన సామ్రాజ్యమంతయు నొక కవికి దానమిడి యరణ్యములపాలై పోయినాడు.

రా—అయ్యా! నీకేమి మతిభ్రమగల్గెనా? కృష్ణదేవరాయలేడ, కానన సీమ న్దిరుగాడు టేడ ?

కృ—మహాత్మా!

మ॥ భ్రమచేఁ బల్కినమాట గాదిది కృపా♦పారీణ నిర్మత్సరుం
డు మహీపాలుఁడ దేదొ మాటపొరపా♦టుఁజేసి నిందించెనా
విముఖుండై వడి రామలింగకవియు♦ విజ్ఞాని యప్పేటిలో
నిమునం బేనియు నిల్వలేక చనియె♦ నిందాపరిభ్రాంతుఁడై.

నాటనుండియు విచారగ్రస్తుఁడైయుండ మొన్న నొకయాచా ర్యుండు సప్తాంగయుతంబగు రాజ్యంబును గోర దానమిడి తనకు పరమ మిత్రుండును కవికులభూషణుండును నైన రామలింగని నెట్లేని కను గొని వానిదయకు బాత్రుండై తరింపవలయునని మునివేషమును ధరించె.

రా—(పరిశీలించి) ఈతఁడే రాయలా యేమి? (ప్రకా) అయ్యా!

గీ॥ పనికిమాలిన యీకవి ♦ ప్రాపుకొఱక?
సకలసామ్రాజ్యరమఁ గూడు ♦ సౌఖ్యమెల్ల
విడిచి కాంతారమున మౌని ♦ వేసమూని
తిరుగు మారాజు కటకటా ♦ ద్రిమ్మరగుచు.

కృ—(చేతులు చాచి) హా! రామలింగ కవీ!

రా—(గ్రహించి) దేవా! నీవేనా? ధన్యుఁడను ధన్యుఁడను.

కృ—(విడువకయే)

మ॥ అనఘా! నిన్ననరానిమాటలని దో ♦ షారోపణల్ జేసియుం
టిని యాతప్పొకలెక్కఁగాఁ గొనక యీ ♦ నీమిత్రునిన్ గూరిమిన్
మనుపంగా నిదె వేఁడుచుంటిఁ గృపతో ♦ మన్నింపు మయ్యా సుహృ
జ్జనభావం బస నిట్టిదేగద దయా ♦ స్వాంతపరిపూర్ణుండవై.

రా—దానికేమిగాని రాజా! ఈవేషమేమి?

కృ—ఇది మీనిమిత్తమే. దేవా ఈక్రొత్తమార్పేమి?

రా—ఇది మీకల్పితమేగదా?

కృ—క్షమింపుఁడు.

రా—రాజా! నిన్ను క్షమింప నేనెంతవాఁడను. దానికేమి? రాజ్యమెవరికి దానమిచ్చితినంటివి? ఎట్లు?

కృ—దేవా! భట్టరాచార్యులనునాతఁడు కవిదిగ్గజములజయింపవచ్చినాడు

రా—పెద్దనాదికవు లందరిని జయింపగలైనా యేమి!

కృ—ఏదీ! ఆయన పేరు విన్నంతనే మనకవుల గుండెలు తల్లడిల్లడిల్ల వడి యాతని జయించుట దుర్లభము; కోరిన పారితోషికమిచ్చి పంపివేయుఁడని యేకగ్రీవంబున నుడివిరి.

రా—అంత మహాపండితుఁడా యేమి? పదపడి.

కృ—పదపడి యామహనీయు నెంతయు సగౌరవమున బూజించి యాతఁ డేకోరిక కోరినను తత్క్షణమే యొసంగ సంసిద్ధుఁడనైతి.

రా—అందనిపండ్లు కాసించెనా యేమి?

కృ—సప్తాంగయుతంబగు రాజ్యమును పారితోషికముగా గోరుకొనెను.

రా—ఇంక తెలసినది. ఆ యాశాపాత్రుఁడు రాజ్యమును గోరుకొనెను. ఈదానశీలురు ధారవోసిరి.

కృ—కవిచంద్రమా!

చ॥ అవని సమస్త మాయనఘుఁ డంచితబుద్ధినిఁ గోరెఁ గావునన్
సవినయబుద్ధి నాతని కొసంగతినంతయు దానికేమి యో
కవికులసార్వభౌమ యను కంపమునన్ నను గారవింప మి
మ్మవిరళబుద్ధి వేఁడెద గృహంబునకున్ దయసేయవే దయన్.

రా—(స్వ) ఈమహనీయుని విడచి నేనుమాత్రముండగలనా? మాకవి దిగ్గజముల సవరగొట్టిన యాఘటికుఁ డెంతటివాఁడో ఒకచేయి చూడవలయును. (ప్రకా) రాజా! నిన్నింత యటముటిపరచిన నాతప్పు మన్నింపుము. నే నీదినంబున పురంబున కరుదెంచుటకు వీలులేదు రేపు తప్పక వచ్చి మిమ్ము సందర్శించెద.

కృ—దేవా! మీయాజ్ఞోల్లంఘన మొనర్పజాలను.

రా—తప్పక వచ్చెదను. మీ రిఁక పురంబునకు దయచేయుఁడు.

కృ—చిత్తము. (నిష్క్రమించును)

రా—(స్వ) అయ్యంగారికి జియ్యంగారి దెబ్బ తగిలినగాని తలతిక్క కుదుటపడదు. కావున నేనిప్పుడు జియ్యరు వేషమును ధరించి యెట్లయినను వంచనజేసి మాప్రభున కొనర్చిన యవమానమునకు నూరింతలు నెత్తిపై గట్టి, పురిబాహ్యప్రదేశమునకు గెంటించి తీరెదను. (నిష్క్రమించును)

(తెరపడును)

సప్తమాంకము సంపూర్ణము.





శ్రీరస్తు.

# వికటకవి తెనాలి రామలింగ

## అష్టమాంకము.

రంగము - ఆస్థానము.

[కృష్ణదేవరాయలు, అప్పాజీ, పెద్దన, భట్టుమూర్తి, భట్టరాచార్యులు ప్రవేశింతురు]

కృ—అయ్యో! రామలింగా! వత్తునని మోసపుచ్చితివేమోయి. ఈయాచార్యులవారికి సప్తాంగయుతంబగు రాజ్యమును స్వాధీన పరచుచుంటిని. ముహూర్తం బాసన్నమగుచున్నది. నీవుగూడ నీ సమయమునఁనుండిన బాగుండెడిది. ఈ సుముహూర్తమున నే సుశీలను నీ స్వాధీనముజేసి నాదారి నే జూచుకొనెడువాఁడను. ఇంతకును పరమాత్మునియనుగ్రహ మెట్లున్నదో.

భ॥చా—దేనికై యాసింతుమో యదియే దవ్వగుచుండునన్నట్లు ఎదురు చూచుచున్న సుముహూర్తసమయ మింకను రాకున్నది. నేను ప్రభువునై నపిదప సమస్తసామంతరాజులు జోహారు లొసంగుచు చేదోయి నుదుట నంటి ఎదుటనిలచియుండ కవి నట భట గాయక మహాజనంబులడుగడుగునకును సాష్టాంగప్రణామము లాచరించుచుండ దేవేంద్రునేని లెక్కసేయని మహావైభవమును జీవితాంతము

వరకు తనివిదీర ననుభవింపవచ్చును. ఇంక నాకన్న నైశ్వర్యవంతుఁడును మహావిద్వాంసుఁడును ధీశాలియు ప్రపంచమున కంచుకాగడా వేసి వెదకినను లభింపఁడు. (ప్రికా) రాజా! యేమి? దీర్ఘముగా నాలోచించుచున్నావు.

కృ—మహాత్మా! ఆలోచించుట కేమిగిలదు. సుముహూర్తమునకై యెదురుచూచుచుంటిని.

భ॥చా—(చిరునవ్వుతో) మంచిది.

అ—పరమేశ్వరా! ఆర్తత్రాణపరాయణా! దీనజనమందార! ఇట్టి యిక్కట్టు లీమహాత్మునకు కట్టి కుడుప సి మన సెట్టులొప్పినదిరా? ఒకేసారి బుద్ధిమాంద్యమున గట్టువడిన మమ్మందరి నేమి సేయఁదలంచితివి మహాత్మా.

పె—(జనాంతికముగా భట్టుమూర్తితో) ఈసమయమున మన రామలింగకవియే యున్న నేదేని యుక్తిచే సీయాపద తప్పింపగలిగి యుండునేమో.

భ—(జనాంతికముగ) పితామహా! మన మందఱముండి యేమి సేయఁగల్గితిమి? విధినిర్ణయము దాట సర్వేశ్వరునకైన తరముగాదు.

భ॥చా—రాజా! ముహూర్తము సమీపించుచున్నది మహోత్సవమునకు వలయు వస్తుసంచయము భద్రపరచితివా?

కృ—చిత్తము.

ద్వా—(ప్రవేశించి) ప్రభూ! అభివందనములు. శ్రీరంగమునుండి జియ్యంగారు వేంచేసి ద్వారముకడ తమసెలవునకై వేచియున్నారు.

భ॥చా—ధన్యుఁడను. జియ్యంగారుగూడ తగుసమయమునకే విచ్చేసి నన్ను కృతార్థునిగా నొనర్చిరి.

కృ—దౌవారికా వారిని త్వరగా లోనికి తోడ్కొనిరమ్ము.

ద్వా—చిత్తము. [నిష్క్రమించును.]

(రామలింగకవి జియ్యరువేషమున కొన్ని పంచాంగములకట్ట చేతపట్టుకొని ప్రవేశింపగా నెల్లరు నిలుచుందురు.)

భ॥చా—(జియ్యరుకాళ్ళకు మ్రొక్కి) మహాప్రభూ! అడియేఁ దాసాః.

రా—సుఖినో భంతు సుఖినో భవంతు.

కృ—(అంజలిడి) పరమపురుష అడియేఁ దాసః.

రా—(నవ్వుచు) శ్రీకృష్ణార్పితం, శ్రీరంగనాథార్పితం, రాజా కుశలముగా నుంటివా?

కృ—స్వామీ! భవదనుగ్రహవశమున నేటివరకు కుశలముగా నే యుంటిని.

రా—పదభ్రష్టుఁడనైతినని వినియుంటినే, కుశలముగా నుండు టెట్లు?

కృ—మహాత్మా! భగవంతుఁ డేది యొనర్చినను మన మేలుకొఱకే గదా!

రా—ధన్యుఁడవు.

భ॥ చా—స్వామీ! ఈ యుచితాసన మలంకరించి నన్ను ధన్యునిగా జేయుఁడు.

రా—మంచిది, శిష్యా, ధన్యుఁడవు. శ్రీరంగరంగా, రంగనాథప్రభూ!

[రామలింగము కూర్చుండగా అందరు కూర్చుందురు]

భ—(పెద్దనతో) పితామహా! ఈజియ్యరు భట్టరాచార్యులవారిగురువు గారా యేమి?

పె—కాదు. వారి మతగురువులు.

భ॥ చా—స్వామీ తమ దర్శనభాగ్యమున ధన్యుఁడనైతిని, దేవా తమ రాక యెందుండియో కతం బెయ్యదియో సెలవిచ్చి మీదాసుని కృతార్థుని జేయుఁడు

రా—శ్రీరంగరంగా, రంగనాథప్రభూ! అయ్యా మేము శ్రీరంగము

నుండి జగన్నాథుని సేవింప నరుగుచున్నారము. పరమపావనులగు భాగవతేయు లున్నచోటికి పోయి వారిని సందర్శించిపోవుట భాగవతధర్మము గావున నిచ్చటికి విచ్చేసియుంటిమి.

భ॥ చా—ధన్యుఁడను స్వామీ నేజేయవలసిన కైంకర్య మేదేని కలదేని యానతిచ్చి మీదాసుని కృతార్థుని జేయుఁడు.

రా—మంచిది, నాయనా, నీవు గుణవంతుఁడవు, బుద్ధిమంతుఁడవు, గురుపూజాధురంధరుఁడవు, విద్వాంసుఁడవు, కాబోవు త్రిలింగాధీశుఁడవు, నీకు వేరుగా చెప్పనవసరములేదు. కాని సత్యవాక్పరిపాలనమే ప్రతిమానవునకును ముఖ్యకర్తవ్యము. ఇదియే గురుబోధ. అర్థులను కృతార్థులనుగా నొనర్చుటయే భాగవతులధర్మము. ఇప్పుడు నీవు సప్తాంగయుతంబగు రాజ్యం బీరాజువలన గ్రహించి సింహాసనారూఢుండవు గాబోవుచున్నావని విని సంతోషించితిని. నీకీర్తి నలుదిశలు ప్రసరింపజేయవలెనను సదుద్దేశము నీహృదయమున కలదేని నీ గురుతుల్యులమగు మాకును మా శిష్యులకును గ్రాసవాసస్సులకును సంవత్సరమునకు సరిపడు రెండంగములు దయచేసి మిగిలినవి నీవు స్వీకరించి రాజ్యపాలనము సేయుము. ధన్యుఁడవయ్యెదవు.

భ॥ చా—(సంతోషముతో) మీపాదసాక్షిగ మీరు గోరిన రెండంగముల నధికసంతోషముతో నొసంగగలవాఁడను.

రా—అయ్యా! మఱొక్కమాట. రాజుచే సప్తాంగములు గ్రహించుటకు ముందుగా మాయవి మాకొసంగవలయును. లేకున్న మీరీయవలసి వచ్చినచో నయ్యవి కొంత యాసతో కూడియుండును. అట్టివి మేము గ్రహింపము

భ॥ చా—చిత్తము. ఆసప్తాంగములు మున్ముందు తామే గ్రహించి, మీరు తీసికొనవలసిన రెండంగములు తీసికొని మిగిలినవి మాకు దయచేయుఁడు.

రా—మంచిది! నాయనా! ధన్యుఁడవు. శ్రీ రంగరంగా! రంగనాథ ప్రభూ!

భ॥చా—(కృష్ణరాయలతో) ముహూర్తము సమీపించినది. నీవు నీ సప్తాంగయుతంబగు రాజ్యమును మున్నుందిమహాత్మునకు స్వాధీన పరపుము. పదపడి నాకు రావలసిన యాగములను నేనుస్వీకరించెదను.

కృ—చిత్తము.

అ—(స్వ) ఇంకను రామలింగకవి రాలేదే? ఈ సమయముననే సుశీల నాతనిస్వాధీనపరచిన బాగుండెడిని. రాజుతో నాఁడు వత్తునని చెప్పియు నింతదనుక రాకుండుటకు హేతు వేమో?

కృ—(అంజలిడి) అమ్మా! భూమాత!

సీ॥ అర్థిఁ బ్రజాభీష్ట • మనవరతము దీర్చి
మసలితి నీదయా•రసము చేత
కవులను గావఁ గం•కణముఁ గట్టి యశంబు
గాంచితి నీదు స•త్కరుణ కతన
సకలసౌఖ్యంబు లు•జ్జ్వలమతిఁ బొందఁ గ
ల్గితి నీదు కార్మిసం•గతినిఁ జేసి
కలుగు రాజన్యలో•కంబు హెచ్చుగ మెచ్చఁ
బేరు గాంచితి నీయ•పారకృపను

గీ॥ ఇన్నిరీతుల నన్నేలు•కొన్న నిన్ను
నర్థి వాంఛింప విమలయ•శోర్థి నగుచుఁ
గూర్మి నిన్నిడుచుంటి న•కుంఠితమతిఁ
సద్గుణనిధాన యాంధ్రరా•ష్ట్రాభిధాన.

(సభవైపు తిరిగి) సభాసదులార!

చ॥ ఘనతరమైన నాదగు న•ఖండమహీవిభవంబునందుఁ గ
ల్గిన నెనలేని హక్కులు ని•లింపుల కేని జయింపరాని వీ
ఘనునకు రచ్చ గెల్చుటను • గానుకగా నిడుచుంటిఁ గాన నా
మనవిని జిత్తగించి నను•మూరుగ నీయనఘు న్భజింపుఁడీ.

(భట్టరాచార్యులను చూచి) దేవా! ఇదే నాసప్తాంగయుతంబగు రాజ్యమును పారితోషికముగా నొసంగుచుంటిని. ఈ రాజ్యమును ముందుగా (రామలింగని చూచి) వీరిస్వాధీనము సేయుమందురా!

భ॥చా—(సంతోషముతో) ఔను.

కృ—(కలశము చేతబట్టుకొని) స్వామీ! గురూత్తమా? గ్రహింపుడు.

రా—శ్రీరంగరంగా! రంగా!

(చేయి చాపగా)

కృ—(నీటిధార విడిచి) దేవా!

గీ॥ పరమపావనమైన మీకరములందుఁ
బుడమి సప్తాంగములు ధారవోసినాఁడ
నింక భూభారమును దాల్చి యేలుకొనుము
ప్రజలు సామంతులును 'మేలు భళిర' యనఁగ

రా—రాజా! ధన్యులము.

భ॥చా—(వినమ్రుఁడై) స్వామీ! తమకు రావలసిన యంగములను తాము స్వీకరించి మా పంచాంగంబులు మా కొసంగెదరా?

రా—(పంచాంగములకట్ట విప్పుచు) అయ్యో! నాయనా! తొందరపడెద వేమి? నీ పంచాంగములు నీ కొసంగకయే పంపెద ననుకొంటివా?

భ॥చా—క్షమింపుడు.

రా—అయ్యో! మీకు రావలసిన పంచాంగములను స్వీకరింపుము. (ఒక్కొక్కటిగా నిచ్చుచు) ఇదుగో! ఇది ప్రభవనామసంవత్సరపు పంచాంగము. ఇది విభవసంవత్సరపు పంచాంగము. ఇది శుక్ల నామసంవత్సరపు పంచాంగము. ఇదుగో యిది యీ సంవత్సరపు పంచాంగమే. ఇఁక నీ పంచాంగములు నీవు తీసికొని దయచేయ వచ్చును.

భ॥చా—(కోపభయావేశపరవశుఁడై) మతగురువులై యుండియు నిట్టి యధర్మములకు పాల్పడుట న్యాయమా?

రా—ఓయీ! న్యాయాన్యాయములు తీర్పరించుట కిది సమయము కాదు. నే నింకను నీ మతగురువుననియే తలంచుచుంటివి కాబోలు! కాదు. నే నీ యాస్థానమునంగల కవులలో నొకఁడను. నా పేరు రామలింగ మఁడుదు. (నిజస్వరూపమును జూపును)

(అందఱు నివ్వెరపడి చూచుచుందురు)

భ॥చా—(కోపముతో) అట్లయిన నన్ను జయింపకుండ నీ వీ రాజ్య మెట్లు స్వీకరింపగలవు?

రా—నీ వెవరిని జయించితివని యీ రాజ్యమును స్వీకరింపనెంచితివి? (కోపముతో) ఓరీ! దురాత్మా, వదరుబోతా, నిన్నుజయించు టొక లెక్కయనుకొనుచుంటివా? ఏదీ, జయించెద, జయించెద, ననుచుంటి వేపాటి జయింపగలవో చూతము జయింపుము.

భ॥చా—(స్వ) ఈతఁడు వరప్రసాదియని వినియుంటిని. ఈతని జయించుట దుర్లభమే. అయినను పరమేశ్వరునిపై భారమిడి సాహ సించెదగాక. (ప్రకా) ఓయీ! నా యొసఁగు సమస్య పూరించిన పిదప మాటలాడుము. ఏల నోటికి వచ్చినట్లెల్ల వృథా వదరుట.

రా—సరే! కానిమ్ము. నీ సమస్య నేను పూరించెద. నా పూరించిన దానికి నీ వన్వయము చెప్పవలసియుండునుసుమా? అట్లు చెప్ప లేకున్న నిన్నిచ్చట దయజూచువాఁ డెవ్వఁడును లేఁడు. తెలసినదా?

భ॥చా—ఛీ! కానిమ్ము. నన్ను నీవే దయజూడవలయునో నిన్ను నేనే దయజూడవలసివచ్చునో ముందు పూరింపుము. ఇదుగో సమస్య- "అధిపుఁడు పంచము న్గడచు నచ్చపుఁగీరితిఁ జెట్టఁబట్టఁడే!"

రా—(నవ్వుచు) ఆహాహా! ఈ మాత్రమున కేనా? ఇదుగో పూరించు చుంటిని! ఇఁకనీవు సంసిద్ధుఁడవై యుండుము.

చ॥ ప్రథమునిపట్టికై చలము•పట్టి చతుర్థునిపట్టి స్నేహరీ
తి ధృతి దలిర్ప నేర్పున ద్వి•తీయునిఁ గట్టిగఁ గట్టిపెట్టి యా

ప్రధనమునక్ దృతీయుఁ బలు ♦ బాసటచే నరిఁ గొట్టినట్టి యా
యధిపుఁడు పంచముస్గడచు ♦ నచ్చపుఁగీర్తిఁ జెట్టఁబట్టఁడే !

[అందఱు నాలోచించుచుందురు)

భ॥చా—(ఆలోచించి తెలియనట్లు నటించి) ఇం దర్థమే లేనట్లుస్ఫురించుచున్నది. అయినను నోటికి వచ్చినట్లెల్ల చెప్పిన దానికర్థమేముండును?

రా—(కోపముతో) ఆపట్టున నోరుమూయుము. దీని కర్థమే లేదా? నీ కాపాటి తెలివితేటలుండి యేడ్చినగదా దీనికర్థము స్ఫురించుట! ఇదుగో! చెప్పుచుంటిని వినుము. పృథ్వ్యాప స్తేజో వాయురాకాశములను పంచభూతములలో మొదటిదగు పృథ్వీకుమార్తెయైన సీతకొఱకై చతుర్థుండగు వాయుదేవుని యొక్క కుమారుండగు నాంజనేయునితో స్నేహముచేసి ద్వితీయుండగు జలదేవుని బంధించి తృతీయుండగు నగ్నిదేవునిచే దత్తంబైన యాగ్నేయాస్త్రముచే శత్రువైన రావణుని యురస్థమగు నమృతకలశంబును భేదించి సంహరించిన రామచంద్రమూర్తి పంచమభూతంబగు గగనస్థలంబు దాటిపోగల కీర్తిని చేపట్టెనను పవిత్రమగు రామాయణకథకే యర్థము లేదనుచుంటివే? నిన్నేమి చేసినను పాపముండునా? (ద్వారమువైపుజూచి) ఓరీ? ఎవఁడురా అక్కడ.

ద్వారపాలకుఁడు—(ప్రవేశించి) అయ్యా! ఏమిశెలవు?

రా—ఇట్టి యాశాపాతులు, రాజద్రోహులు, ఆత్మశ్లాఘపరాయణులు, రాజాస్థానంబుల నుండతగరు. కావున వీనిని పురిబాహ్యప్రదేశమువరకును గెంటింపుము.

ద్వా—చిత్తము! (భట్టరాచార్యులను చూచి) రావయ్యా? ఇవతలకు.

భ చా॥— (ముకుళితహస్తుఁడై) రామలింగకవిచంద్రమా! నాతప్పు మన్నింపుము. నీప్రజ్ఞావిశేషంబు లనంతంబులు! నీ వీ సభనుండి యెటకో వెడలిపోతివని విని నీతోడివారిని జయింప వచ్చితిని. జయించితిని. కాని నాదురదృష్టదేవతయే నిన్ను తోడ్కొనివచ్చి

నాగర్వమును సర్వమును ఖర్వముగా నొనర్చినది. ఇంక గర్వరహితుఁడనై నీయనుగ్రహావశమున ధన్యుఁడనైతిని. మహాత్మా! నన్నుగెంటింప నవసరములేదు. మీయాజ్ఞాబద్ధుఁడనై నేనే వెడలిపోయెదను.

రా—అట్లయిన త్వరగా దయచేయుము.

భ॥చా—(సభవైపు తిరిగి) దురాశ దుఃఖహేతువుగదా! అందును

"శ్లో॥ హరిణాపి హరేణాపి । బ్రహ్మణాపి సురైరపి
లలాటలిఖితారేఖా । పరిమార్ష్టుం నశక్యతే."

ఇందులకు నాకథయే ప్రబలతార్కాణము.

(నిష్క్రమించును)

రా—రాజా! ఇంక నీవు సింహాసనముపై నధిష్ఠించి మమ్మెల్లరను యథావిధిగా పరిపాలింపుము.

కృ—మహాత్మా! పవిత్రహృదయుండవును మిత్రుండవును నగు నిన్ను పరిగృహీతునిగను నన్ను దాతగను సంఘటించిన భగవంతున కెంతయు కృతజ్ఞుఁడను. దేవా! సంతుష్టాంతరంగుఁడవై మమ్ముల బరిపాలింపుము. నాయిడినదానము తిరిగి పరిగ్రహింప నేనంతనెట్టినే?

అ—కవికులధుర్యా! రామలింగకవివర్యా! నీదర్శనభాగ్యము లభింపదనుకొంటిని కాని మాపూర్వజన్మార్జిత సుకృతఫలవిశేషంబున నిన్ను జూడగల్గితిమి ధన్యులమైతిమి. (కృష్ణదేవరాయలతో) రాజా! ఈ రాజ్యంబునకు సమంబగు ధనంబొసంగి పైన మీ యిచ్చివచ్చిన పారితోషికంబిడి యథావిధిగా రాజ్యపరిపాలనం బొనర్పుము.

రా—మంచిది. అప్పాజీ! మీయూహ సమంజసముగా నున్నది.

కృ—అప్పాజీ! కోశాధికారి కీవిషయమును నాయాజ్ఞగా నెఱింగింపుఁడు పదపడి సుశీలను తోడ్కొని వత్తురా?

అ—చిత్తము. (నిష్క్రమించును)

పె—(రామలింగనితో) రామలింగకవీ! మమ్మెల్లరిని ధన్యులగా నొనర్చిన నీ నిష్కళంకహృదయమునకును రాజభక్తికిని ఉదార స్వభావమునకును పిన్నవగుటచే మ్రొక్కరామి వేనవేలాశీర్వచనము లొసంగుచుంటిని.

భ—కుకవిజనదురహంకారశృంగభంగా! రామలింగా! నీమహిమను సామాన్యులెఱుంగుట దుర్లభము. నీవు పూజ్యుఁడవు. దేవీవరప్రసాదుఁడవు. నీయనుగ్రహావశంబున మే మెల్లరము ధన్యులమైతిమి.

[అప్పాజీ సుశీలతో ప్రవేశించును]

సు—(కృష్ణదేవరాయలను చూచి) తండ్రీ! నమస్కారములు.

కృ—తల్లీ! ధన్యాత్మవు.

రా—(స్వ) ఆహా! మరల నీజగన్మోహనాకారము నెన్నిదినంబులకు చూడఁగల్గితిని.

క॥ విధుకృతకదనము వదనము
మధుకరనికరముల గేరు ♦ మగువచికురముల్
విధుమధుకరలీలాజయ
మధురోక్తులు పిక్కలౌర ♦ మధురాధరకున్.

కృ—(చిరునగవుతో) కవిసార్వభౌమా!

సీ॥ కాళీమహాదేవి ♦ ఘనకృపారసమున
నోలలాడిన బుద్ధి♦శాలి వీవు
ప్రగడరా ణ్ణరసింహు ♦ ప్రజ్ఞావిశేషంబు
బూదిపాల్జేసిన ♦ ప్రోడ వీవు
అనఘు తాతాచార్యు ♦ మనమునన్గల మత
ద్వేషంబునకు స్వస్తి♦దెల్పి తీవు
పోయిన సామ్రాజ్య ♦ మును గెల్చి హితుని స
త్కీర్తినిల్పిన పుణ్య♦మూర్తి వీవు

గీ॥ కాన, నాచేత మున్నరణ్యాన నీదు
భార్యయగు నీసుశీలకుఁ బ్రాణదాన
మొసఁగి రక్షించి యిదె యిడుచుంటిఁగొనుమ;
రమ్యగుణసంగ! తెన్నాలి రామలింగ!

రా—రాజా! ధన్యుఁడను.

మ॥ కలకాలంబును నీదయారసమునన్ గాంతాజన శ్రేణిలో
పల మేల్బంగరుబొమ్మనై తనరు నీ పంకేజపత్రేక్షణ
న్వలనొప్పన్ గ్రహియింపఁగాఁ గలుగుదివ్యంబైన సౌఖ్యంబునా
నల సామ్రాజ్యమునందునన్ బ్రభుని సేయన్ జాలితే పుణ్యుఁడా!

(నిత్యానందస్వాములవారు ప్రవేశించి)

నిత్యా—ఉత్తమదంపతులకు జయము. పవిత్రహృదయులకు జయము.

రా—(కాళ్లంటి) గురూత్తమా! అభివాదనము.

సు—నిత్యానందస్వరూపా! నమస్కారము.

(మిగిలినవారందఱు నమస్కరింతురు)

నిత్యా—సుఖీభవ! సుఖీభవ! నాయనా! కుమారా! ఈ పవిత్రచరిత్ర నీభార్యయే. నీవు నాయుపదేశానంతరమున దేవీవరప్రసాదముచే దివ్యత్వంబను పునర్జన్మధరించి యీపతివ్రతాతిలకమును మరచి పోతివి. నీకై యీసుగుణముల ప్రోవు పడరానియిక్కట్టులుపడి తుదకు దుర్మార్గులగు కిరాతులచే మరిడీకి బలిగా గొనిపోబడినది. కాని, భక్తజనచింతామణి యగు శంకరునియనుగ్రహమున యీమీరాజుచే రక్షింపఁబడినది. ఏది యెట్లులైనను తుదకు దయామయుండగు పరమేశ్వరునికరుణాప్రభావమున ధన్యులరై యాచంద్రతారార్క స్థాయిగా వర్ధిలు కీర్తికాంతను పొందగల్గితిరి. మీచరిత్రము పవిత్రమైనది. మీదాంపత్యానురాగము భూమిజనుల కాదర్శ ప్రాయమై యొప్పుచు నిట్లగుగాక!

## —♦ భరతవాక్యము ♦—

చ॥ భువినిఁ జరింతురిగాక విధు♦భూషణుదివ్యపదారవిందసం
భవమకరందబిందురస♦పానమునన్ దగ నాల్మగంద్రుఁ స
త్కవులు లిఖింతురిగాక నిర♦తంబు సుఖంబుగ నేల నేలు భూ
ధవుల విశాలగాథల సు♦ధారససిధుల కావ్యవీథులన్.

(అందఱు నిష్క్రమింతురు)

[తెఱపడును]

### గద్యము

ఇది శ్రీవిశ్వకర్మబ్రాహ్మణ వంశ పయఃపారావార రాకాసుధాకర
జనా బంగారయ్యాభిధాన పౌత్రిస్వలస్వామ్యాఖ్య భిషగ్ఘన
తనూభవ వీరభద్రమాంబికాగర్భసూక్తి ముక్తాఫల
శ్రీ చంద్రశేఖరకరుణాలబ్ధ సహజకవిత్వ తత్వ
బుధజన విధేయతాధుర్య సత్యనృసిం
హాచార్య ప్రణీతంబైన శ్రీ రామ
లింగ దృశ్యకావ్యము
సర్వము
సంపూర్ణము.



వలయువారు :—

జనా సత్యనృసింహాచార్యులు,

గుడివాడ.

అని వ్రాయవలయును.

A. G. Press, Beswada.

